# పౌష్టిక అనుభవము మరొకటి ఇవ్వజాలదు

ఔను! యమ్మీ యమ్మీ ట్రూ బిస్కట్లు ఆనందంతో అనుభవింపదగినవి....రుచికరంగా కరకరలాడుతూంటాయి, ఎన్నిసార్లైనా అల్లా నోట్లో వేసుకోకుండా వుండలేరు! తేనె, గ్లూకోజ్, పాలపొడి, ఏలక్కాయల ఎసెన్స్, తాజా ఎండు కొబ్బరి మొదలైన సహజ పౌష్టిక పదార్థాలు అతి జాగ్రత్తగా సూత్రీకరింపబడి విస్తృత ప్రయోగ ఫలితంగా ఏర్చి కూర్చిన శ్రేణి.

**హనీ గ్లూకోజ్**

తీయని బలవర్ధకమైన బిస్కట్లు, తగినంత అధిక పాళ్ళలో తేనె, ద్రవరూపంలో గ్లూకోజు చేరియున్నవి. ప్రతీ ప్యాకెట్ 350 క్యాలరీల శక్తిని కలిగిస్తుంది.

**నీస్**

కమ్మని కొబ్బరి బిస్కట్లు - తాజా ఎండు కొబ్బరి పుష్కలంగా వుండటంచేత అసలైన కొబ్బరి రుచినిస్తాయి.

**"యాలక్కాయి" కష్టర్డ్ క్రీమ్**

చప్పరించడానికి స్వాదుష్టమైన క్రీమ్ బిస్కట్లు అసలైన యాలకులతో. ఎంతో ఉత్తమమైన క్రీమ్ బిస్కట్లు.

**మారీ**

కొంచెం తీపితో గరగరలాడుతూ కాఫీ, టీలతో తీసుకోడానికి అనువుగా వుంటాయి. మీ పానీయాలతోపాటు తినడానికి ఆదర్శమైనవి.

**ఇంకా ఎన్నెన్నో**

వీటిలో ప్రతీదీ కూడా విశిష్టకరమైన పొట్లంలో ఉంటుంది. వాస్తవానికి బిస్కట్ల తయారీలలో మేమొక్కరమే సెలోఫేన్ (పొట్లం కట్టడానికి ఖరీదైన కాగితం) ధారాళంగా వుపయోగిస్తాము. నేరుగా బిస్కట్లను చుట్టివుండటంచేత బిస్కట్లు సువాసనతో ఉంటాయి - గరగరలాడు తూంటాయి - ఫ్యాక్టరీనుంచి అప్పుడే వచ్చినట్టు తాజాగా వుంటాయి.

**మీరు మీ కుటుంబం పుష్టికరమైన రకరకాల బిస్కట్లతో విందు చేసుకోండి. వాటి విశిష్టత మీరే గ్రహించండి.**

## ట్రూ బిస్కట్లు

**TRUE biscuits**






**4 'మాండీ' పతకాల విజేత**




ఇండియాలో అధునాతనమైన ఫ్లోర్ మిల్ మరియు ఉత్తమమైన బిస్కట్ల తయారీ ఫ్యాక్టరీలో తయారు కాబడినవి.

Headstart/ATM/104










**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]

శుక్రవారం : 12-10 '79
సిద్ధార్థినామ సం. ఆశ్వీయుజ బ. సప్తమి
సంపుటము 73 : సంచిక 7

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 85 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక




VEP
VEP





"అనంతరావు బుర్ర ఆర్కిమిడీసు బుర్ర అంతటిది అయితే అయ్యుండొచ్చు ఏ కొత్త సూత్రాన్నో, మూలకాన్నో ఇట్టే కనిపెట్టేసి 'లారెన్సియం', 'ఐనిస్టీనియం'లా 'అనంతియం' వంటి మస్కిర కీర్తి, భట్నాగర్ అవార్డు, నోబులు ప్రయిజూ కూడా కొట్టేయగల సమర్థుడూ కావచ్చు. కాని దేశంలో అవినీతి, మూఢనమ్మకాలూ గట్రా రాను రాను పెరిగిపోతున్నట్టు అతగాడిలో ఓ మోస్తరు అమాయకత్వం కూడా రోజు రోజుకూ పెరిగిపోతూంటే చూస్తూ ఊరుకోవడం ఏం భావ్యం? ఇంగ్లీషు మూవీలు తప్ప, 'టిక్కెట్టుతోపాటు ఆడాళ్ళకో చేతిరుమాలు మగాళ్ళకి రెండు తలపోటు మాత్రలు ఉచితం' వంటి అతిబరువైన సెంటిమెంటల్ తెలుగు పిక్చర్సు వాడు చూడకపోయినా, నిద్ర రావాలనుకొన్నప్పుడు తప్ప మహారచయిత్రుల సినిమాటిక్ భారీ నవలలు చదవకపోయినా, సెలవు రోజుల్లో తప్ప హార్లీ ఛేజ్, అగథా క్రిస్టీని ముట్టుకపోయినా, సోఫియాలారెన్స్, లోలో బ్రిగిడాను తప్ప మిగతా వారిని మెచ్చుకోపోయినా పెద్ద ఇబ్బందేమీ లేదు. కాని గర్ల్ ఫ్రెండ్సుతో కలిసి పాప్‌కార్న్, వేరుశనక్కాయలూ నములుతూ ఇంచక్కా స్వీట్ నథింగ్స్ చెప్పుకోడానికి అనువైన అందమైన బీచ్ విశాఖపట్నంలో ఉందే, కనువిందు చేసే సిమ్లెన్లూ, బెలపాటమ్సూ, షిఫాన్లూ, నైలెక్సులూ, పూరీ ఫ్రాకీలు, మేక్సీలు ప్రపంచం నిండా ఉన్నాయే, వంటి ప్రాథమిక సూత్రాలు ఏమాత్రం గ్రహించకుండా, రాత్రింబవళ్ళూ పుస్తకాలతోనూ, సాయంత్రంపూట విధిగా జిమ్నాషియం దగ్గర తంటాలు పడే ఈ బడుద్ధాయిగాణ్ణి సంస్కరించాలనీ, అమ్మాయిల పేరు వినితేనే అరవైమైళ్ల స్పీడులో ఆమడ దూరం పరుగుపెట్టే ఈ చవటాయ్‌గాణ్ణి ఉద్ధరించాలనీ శతవిధాల ప్రయత్నిస్తున్నానే..." అంటూ తెగ వాపోయే చలం అమాంతం షాక్ తిని ఆనందభాష్పాలు రాల్చే పరిస్థితి కల్పిస్తూ అనంతరావు ఉన్నట్టుండి ఓ పెద్ద సాహసం చేసేసి యూనివర్సిటీ అంతా పేరు మోగించేసుకొన్నాడు. అతను చేసింది నిజంగా సాహసమనే చెప్పాలి. ఎందుకంటే...

# అన్నపూర్ణా... ఆర్కిమెడీసు...

— బాజ్జి



సైన్సు కాలేజీ సీరియస్ విద్యార్థిని అన్నపూర్ణ అంటే తెలిసిన వారు యూనివర్సిటీ మొత్తంమీద ఒక్కరూ లేరనేది నిర్వివాదం. అప్సరస అందంలో సగం అపరవాణీ అంత కూడా ఆమెలో ఆ వెర్రి బ్రహ్మ దేనికు పెట్టాడా అని ఆస్తికులూ, అది జీన్సులోంచి పుట్టుకొచ్చిన ఒకానొక వారసత్వ గుణం అని నాస్తికులూ వాదించుకొన్నా, ఆమె పట్ల జరిగిన ఏ చిన్న పొరపాటుకైనా చీవాట్లో, శృతిమించి రాగాన పడితే చెప్పు దెబ్బతో తింటారని అందరిలోనూ గాఢంగా నాటుకు పోయిన అభిప్రాయానికి మాత్రం వాద ప్రతివాదాలు లేవు.

ఆనాటి సంఘటన అచ్చు సినిమాలోలా జరిగింది. విద్యాపీఠం దగ్గర గుంజీలూ గట్రా తీస్తూ ఉండాల్సిన అనంతం, ఆ సాయంత్రం పూట యూనివర్సిటీ ఇన్‌గేటు ముందు సిటీబస్సు కోసం ఎదురుచూస్తున్న సారథి, విశ్వాం, ఏలం తదితర మిత్రమండలి మధ్య పొరపాటున నిలబడి ఉన్నాడు. నెంబర్ టెన్ ఎక్కి పాత పోస్టాఫీసు దగ్గర దిగి, అక్కడ ఓ మిత్రుణ్ణి కలిసి అటు నుంచి గుప్తా బుక్ స్టోరుకో వెళ్ళి పుస్తకాలనూ అమ్మాయిలనూ వడిలో పనిగా పరామర్శించి, తిరుగు బస్సులో మళ్ళీ బెస్సును కేచ్ సేసి కేటీహెచ్ దగ్గర దిగి, అక్కడ మద్దెల వాయిస్తూ పాటలు పాడే గుడ్డిరాముడితో "కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్", "పరదేసియోం సే నా అఖియా మిలానా" వంటి గుడోల్డ్ సాంగ్స్ పాడించుకొని ఆవక తోచింది సాయంచేసి, నడుస్తూ కబుర్లు చెప్పుకొంటూ కలెక్టరాఫీసు, కృష్ణచైతన్య దాటి లేడీస్ హాస్టలు మీదుగా బీచ్ కెళ్ళాలనే కార్యక్రమం రూపొందించిన సారథితో స్నేహితులంతా ఏకీభవించారు. తన మామూలు కార్యకలాపాలకు భంగం వాటిల్లుతుంది గనక వీటో చేద్దామని ముందు అనుకొని, వారానికోసారి అందులో శనివారప్పూటన్నా వీరి మాట వినకపోతే బావోదుకదా, విశ్వంగాడితో 'ఫాజిల్', 'పిరమిడ్', 'హైడ్రోజన్ పల్ఫైడ్', 'స్పంజి', వంటి ఘోరాతి ఘోరమైన తిట్లు తినడమెందుకు లెద్దూ అని మూరు మనము పొందినవాడై ఈ ప్రోగ్రాములో తన కిష్టమైన బుక్‌స్టోరు విజిట్ కూడా ఉండడం జ్ఞాపకానికొచ్చి సరే అంటే సరే అన్నాడు అనంతం.

"కాలక్షేపం బఠాణీల వాళ్ళూ కత్రా బతకాలనే సదుదేశంతో ఎబిసీలు ఎప్పుడూ లేటుగా రావడం ఆనవాయితీ అయినట్టే, తను పయనించే వాహనం ఒక జీవిత కాలం లేటు కాకపోయినా ఎప్పుడూ అరగంట లేటన్నదే జగమెరిగిన సత్యం. ఆఫ్టాల్ ఓ పుస్తకం ఎక్సెస్ లగేజీ కాబోదు. అప్పింటి కన్నా ముఖ్యం ఫైనీజ్ ప్రెషన్..." సదరు అభిప్రాయాలు ఉన్న అనంతం వ్యోమగాముల యాత్రా విశేషాల బొమ్మల పుస్తకం తనతో తెచ్చుకొని, కళ్ళజోడు జారినా జారకపోయినా అలవాటుగా ఎడమచేతి చూపుడు వేలుతో వెనక్కు నెట్టుకొంటూ నెలకోసారి తప్పగిముకోని గెడ్డాన్ని మధ్య మధ్య తడుముకొంటూ పేజీలు తిరగెయ్యడంలో పూర్తిగా నిమగ్నమై పోయాడు.

అన్నపూర్ణ, ఆమె నేస్తాలు యమున, విజయ, లలిత తదితరులను యూనివర్సిటీ ఔట్‌గేటు దగ్గర ఎక్కించుకొని బయలు దేరిన నెంబర్ టెన్ ఇన్ గేటు ముందు ఆగి మళ్ళీ బయలు దేరబోతున్న సమయంలో, మిత్రులతో బస్సు ఎక్కేసిన విశ్వం ఎందుకో ఆమనాసం వచ్చి కిటికీలోంచి తొంగిమూసి "స్పంజి"

## అన్నపూర్ణా ఆర్కిమెడీసు

అంటూ చిన్న స్త్రైక పెట్టాడు. పుస్తకంలో లీనమై బస్సు ఎక్కకుండా కిందే ఉండిపోయిన అనంతం ఆ గావు కేకతో ఒక్కసారి ఉలిక్కిపడి చుట్టూ ఎవరూ లేకపోవడం గమనించి కదులుతున్న బస్సు చటుక్కున ఎక్కేసాడు. హడావిడిగా బస్సు ఎక్కేసిన అతగాడు ముందు కంటూ దూసుకుపోయి ఎక్కడ కూర్చుంటున్నాడో అన్న ధ్యాస అంత మాత్రం లేకుండా అన్నపూర్ణ ప్రక్కనే వున్న ఖాళీసీట్లో అమాంతం కూలబడి పుస్తకంలో మళ్లీ కళ్లు దూర్చేశాడు...

"మేమూ మీతో సమానమే మేమూ అడ్వాన్సుడే అంటూ డప్పాలు కొట్టే అమ్మాయిలు చాలా చాలా విషయాల్లో ఎందుకు ముందంజ వేయరో అర్థంకాదు. వీళ్లు ఇక వస్తే బాగుపడరు..." అనే సారథి వాదన నిజమేనన్న సంగతి మరోసారి రుజువయింది

...ఈ హఠాత్సంఘటనకు అన్నపూర్ణ మొదట అవాక్కయిన మాట నిజం. బస్సు నడుస్తూనే ఉంది. అనంతం ఏమీ పట్టనట్టు పుస్తకం చదువుతూనే ఉన్నాడు.

"ఇడియట్" అంది యమున కటువుగా.

"దివానీ" విజయ కసిగా అంది.

"ఒక్కటివ్వవే" సలహా ఇచ్చింది లలిత.

విస్తుపోయి చూస్తుండిపోయారు మిగతావాళ్ళు.

అన్నపూర్ణ కొంచెం తేరుకొని "హాయ్ మిస్టర్" అంది.

"మిస్టర్ అమాయక్రావ్" అందించాడు చలం.

"వెల్ మిస్టర్ అమాయక్రావ్" అంది అన్నపూర్ణ.

అనంతరావులో చలనం లేదు.

"వాడిపేరు అనంతరావండీ బాబూ" అన్నాడు విశ్వం.

"ఆమెకు తెలీకనా" అన్నారెవరో.

"అనంత్రావ్" ఈసారి కోపంగా అంది అన్నపూర్ణ.

అతగాడిలో మార్పు రాలేదు.

"ఆర్కిమిడీస్ అని పిలవండి తప్పక పలుకుతాడు" సలహా ఇచ్చాడు సారథి.

"ఏయ్ ఆర్కిమిడీస్" అన్నపూర

అందమైన కళ్ళు కోపంగా కొద్దిగా చిరు పెక్కాయి.

అనంతం ఒక్కసారి తల పైకెత్తి మళ్ళీ పుస్తకంలో తల దూరేశాడు.

"చెవుడో, స్క్రూలూజో మరి?" అంది యమున.

"చెవుడా లేక సరిగా వినబడదా? ఆ సన్నమెట్ల దగ్గర మంచి డాక్టరున్నాడు. ప్లీజ్ కన్సల్ట్" అంది అన్నపూర్ణ కొంచెం గట్టిగా.

జోకు పేలింది నవ్వులు రాలాయి బస్సు నిండా. అన్నపూర్ణకు మాత్రం కంపరమెత్తింది. వీడికి ఎలా బుద్ధి చెప్పాలా అని తీవ్రంగా ఆలోచించడం మొదలెట్టింది.

లెక్చరును జోలపాటలా భావించి, పాఠం చెప్పడం ఆగగానే రక్కున మేల్కొనే ఒకానొక విద్యార్థిలా, నవ్వులు ఆగిపోయిన తర్వాత అనంతం అంతరిక్షంలోంచి అమాంతం సిటీ బస్సులోకి వూడిపడ్డాడు. చుట్టూ ఒక్కసారి కలయజూసి మళ్ళీ తలొంచేసుకొని పుస్తకంలోకి చూస్తూ "చూడండి మిస్, మీరు ఆ డాక్టరుగారి ఏజెంటు కాదని స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ఆయన చెవిటి డాక్టరు కాదు. నల్ల డాక్టరు. ఏ మిస్ ఆయనకు చెప్పడానికి వచ్చి వగర్చారో లేదో నాకు తెలీదు గాని, నల్లవారికి మాత్రం ఆయన ఒంటి స్క్రూ సెట్టూ గట్టూ పెడతారు" అన్నాడు అమాయకుడైన అనంతరావు. ఇంత గొప్పగా రిపోర్ట్ లాంటిది ఇవ్వగలడని, ఇస్తాడనీ కలలో కూడా ఊహించి ఉండని జనాలంతా ఒక్కసారి దంగైపోయి, తర్వాత ఆహా... ఓహో... ఆహ ... ఓహోహో... అంటూ రకరకాల హర్షధ్వానాలూ, కరతాళధ్వనులూ చేసేశారు.

"అలాగా ఒక్కసారి మీ నాలుగు కళ్ళతో కాస్త ఇలా చూడు" అంది అన్నపూర్ణ.

రోజుకో రంగు ఫిరాయించే రాజకీయ వ్యభిచారుల కల్లబొల్లి మహోపన్యాసాలు విని విని బోరెత్తి వళ్ళు మండి కుళ్ళిపోయిన గుడ్లూ, చెప్పులూ, రాళ్ళూ విసిరే వారినీ, అసలు సమస్యను పక్కదోవ పట్టించి చీటికీ మాటికీ బస్సుల మీద విరుచుకుపడే దండగీళ్ళనూ ఒకే గాటకు కట్టేసే డ్రైవరూ కండక్టరూ, "గోరంత దాని కొండంత చేయడమెందుకు? వాళ్ళే సర్దుకుంటారు లెద్దూ" అనుకొని తను తను పనిలో పూర్తిగా నిమగ్నమై పోయినట్లు నటించసాగారు. మిగతా వాళ్ళకు తమాషా చూద్దామని మహా ఇదిగా ఉంది.

బస్సు సిరిపురం దాటేసింది.

"... కాస్త ఇలా చూడు" అని అన్నపూర్ణ అనగానే, అనంతం తన మామూలు ధోరణిలో కళ్ళజోడు వెనక్కి ఒత్తి గడ్డాన్ని రాసుకొంటూ ఆమె ముఖంలోకి సూటిగా చూశాడు.

"చదవడానికి నా ముఖం మీద జోకు లేవీ లేవు గని, ఇటు ఇవి చదువు" అందామె కిటికీ పైన ఉన్న అక్షరాలు చూపిస్తూ.

"...స్త్రీలు...స్త్రీలు..నిల్చుండినప్పుడు తల వంచవలెను ... టిక్కెట్టు లేనిదే ప్రయాణం చేయరాదు .. చేతులు బైటకు పెట్టరాదు... హరేరామ హరేకృష్ణ ... రైటు వెలుగు నప్పుడు సెల్ఫు కొట్టరాదు. బస్సు పూర్తిగా ఆగిన తర్వాతనే ఎక్కవలెను. దిగవలెను ... మూవ్ విలాంగ్‌ది గ్యాంగ్‌వే... అందరూ ముందుకు జరగవలెను...ప్రథమ చికిత్స పెట్టె నెంబరు. కృష్ణ కృష్ణ హరే హరే... చిల్లర తెచ్చుకొనవలెను. పొగ త్రాగరాదు... ముందు సీటు పై కాళ్ళు పెట్టరాదు... పురుషులు .. పురుషులు..."

ఆ చివరనుంచి ఈ చివరదాకా ఉన్నవీ లేనివీ అన్నీ కలగపులగంగా యమాస్పీడుగా చదివేసి మళ్ళీ తన ధోరణిలో పడిపోయాడు అనంతం. ఎందరికో బుద్ధి చెప్పిన అన్నపూర్ణకు అతగాణ్ణి ఎలా సాధించాలో అంతుపట్టలేదు. చాచి లెంపకాయ కొడదామని అనుకొనే మళ్ళీ ఎందుకో తమాయించుకొంది ఏం చెయ్యాలో సమయానికి తోచక "ఖర్మ పట్టి జడపదార్థంలా ఉన్నాడేంటే యమునా" అంది విసుగ్గా.

"జడపదార్థాలూ ముడిపదార్థాలూ ఐ మీన్ జడలేసుకొనే వాళ్ళూ, ముళ్ళేసుకొనే వాళ్ళూ ఆడాళ్ళలోనే ఉంటారు తప్ప మగాళ్ళలో వుండరని పురాణం సీత చెప్పింది ఐ మీన్ చెప్పాడు పూర్ణగారూ. అన్నట్టు అడగడం మర్చిపోయాను సుమండీ. ప్లీజ్ కోప్పడకండి. డోంట్ యు బిలీవ్ ఇన్ విమెన్స్ లిబ్" పుస్తకంలోంచి తలెత్తి ఆమెవంక సూటిగా చూస్తూ అన్నాడు అనంతం.

అనంతం జోకు మళ్ళీ పేలినా, అన్నపూర్ణ సమాధానం విని అంతా ఒక్కసారి సీరియస్ అయిపోయారు.

"షటప్. ఐ డూ బిలీవ్ ఇన్ విమెన్స్ లిబ్. ఐ డోంట్ లీవ్ యూ." కోపంగా చడామడా ఏవేవో తిట్టుకొంటూ పూర్ణా మార్కెట్ దగ్గర స్నేహితురాళ్ళతో దిగిపోయింది అన్నపూర్ణ.

## తరం అంతరం

### డాక్టర్ దాశరథి

తండ్రికీ కొడుక్కీ తరం అంతరం
గురువుకీ శిష్యుడికీ తరం అంతరం
నేతకూ జనతకూ తరం అంతరం
అంతరం తప్పదని అనుకుంటాం అందరం;

వయసువల్ల వస్తాయి అంతరాలు
మనసువల్ల పోతాయి ఆ అంతరాలు
ఎందుకు అంతరాలు తరతరాలు ?
తెలుసుకుని వెలగాలి అంతర్యాలు !

అంతరాల దొంతరలు ఎంతకాలం ?
సమాజాన్ని కూల్చటకు అవే మూలం;
యువతరాన్ని నవతరాన్ని గుర్తించాలి
అంతరాలు లేకుండా వర్తించాలి.

"నెక్స్ట్ టైమ్ గుడ్ లక్" అరిచారు.

ఈ సంఘటన జరిగిన నాటి నుంచీ, "బంగారం లాంటి భవిష్యత్తుకు మంగళం పాడుకొన్నాడు పాపం పసివాడు. ఈ దెబ్బతో వాడి వావ్వర్ క్లోజ్" అంటూ సానుభూతి కురిపించేవారూ, "ఏం ఫరేదు బ్రదర్ మేమంతా లేమూ" అంటూ భుజం తట్టి ధైర్యం నూరిపోసేవారూ, "నిజం ఇలాంటి సిచ్యుయేషన్స్‌లోంచే అభిమానాలూ గట్రా పుట్టుకొస్తాయి. ఆల్ ది బెస్ట్" అంటూ షేక్‌హేండ్లు ఇచ్చే వారూ అనంతాన్ని ఉక్కిరి బిక్కిరి చేసి అతని మనస్సు పరి పరివిధాల పోయేలా చేయసాగారు.

అయితే అనంతరావు అంతగా బెంబేలు పడి పోలేదుగాని మరునటి రోజు మధ్యాహ్నం వరకూ అమితంగా పశ్చాత్తాప పడి పోయాడు. ఇక ఉండబట్టలేక క్రాఫ్ వెరిపేసుకొని, నలిగిపోయిన తెల్ల చొక్కా, రంగు వెలిసిన నీలం ఫాంటుతో టక్ చేసుకొని, చొక్కా జేబుకు కాస్త ఎర్రసిరా అంటించుకొని బాత్రూమ్ చెప్పులేసుకొని, అద్దె సైకిలు తొక్కుకొంటూ చెమటలు కక్కుతూ లేడీస్ హాస్టలు చేరుకొన్నాడు.

"నిజం మీరు నమ్మాలి పూర్ణగారూ. ఏ ఒట్టు వేయమన్నా వేస్తా. ఈ దుర్బుద్ధి ఐ మీన్ ఈవ్‌టీజింగ్ నాకే కోశానా లేదు. మన క్లాస్‌మేట్ చలంగాడు లేడూ వాడు నన్ను చూసి ఓర్వలేకో, తమాషికో, ఎందుకో సరిగ్గా తెలీదుగాని బాగా ప్రవోక్ చేసి వంద బెట్ కాయించి నన్ను కమిట్ చేయించాడు. ఎంతగా దిగజారిపోతున్నానో మీ కర్థం కాదు. మీరు... క్షమించకపోతే... నేను... బతికి ...బట్ట...కట్టడం... కల్ల... గొంతు ... ఆరుకుపోతోంది...నాలుగుగ్లాసులు...చల్లని ...త్రాగే నీరు .. ఇప్పిస్తారా ..." అనేసి చూపుడు వేలుతో కళ్ళజోడు నొక్కి పెట్టుకొని, గెడ్డాన్ని తడుముకొంటూ స్పృహ కోల్పోయిన వాడిలా ఈజీ చెయిర్‌లో కూలబడి పోయాడు.

తాను ఇస్తున్న మంచినీళ్ళను అమాయకంగా తాగుతున్న అనంతాన్ని ఏమీ అనలేక మౌనంగా పరిశీలిస్తూ ఉండిపోయింది అన్నపూర్ణ. పుస్తకాలు నెమరేయడం మానేసి కారాలు మిరియాలు నూరసాగారు అక్కడున్న ఆమె మిత్రురాళ్ళు. మంచి నీళ్ళు తాగడం పూర్తిచేసిన అనంతం ఒక్క సారి ఆమెవంక చూసి తర్వాత తల దించేసుకొని నేలచూపులు చూస్తూ మౌనంగా ఉండిపోయాడు.

అనంతరావు వాలకం చూడగానే అన్నపూర్ణ కోపం క్రమ క్రమంగా గాలిలోకి ఎగిరి పోయింది. బతికి బట్ట కట్టడం కల అనగానే కొంపతీసి ఆత్మహత్య చేసుకొనే రకమో లేక స్ట్రైకింగుకు సిద్ధపడిన బావతో అని ఆమె మొదట భయపడింది. అతన్ని తొందరగా పంపించెయ్యకపోతే బాయ్ ఫ్రెండ్సు లేనివాళ్ళూ, మేట్రన్ తదితరులు ఏడుస్తారనో, జెలసీ ఫీలవుతారనో, బీచ్‌కో, లైబ్రరీకో వెళ్ళే టయిమ్ అయినందువల్లనో లేక అతని అంతరంగాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నందువల్లనో ఏమో గాని, స్నేహితురాళ్ళ మాటలు ఏమాత్రం ఖాతరు చేయకుండా తనకోపాన్నంతా దిగమింగేసి అతన్ని మనస్సులోనే క్షమించేసింది.

"డోంట్‌బీసిలీ హియరాఫ్టర్... టేకిటీజీ..." అంటూ గేటు వరకు వచ్చి సాగనంపుతూ "సీయూ" అంటూ ఫక్కున నవ్వేసింది అన్నపూర్ణ.

"థాంక్యూ పూర్ణా... థాంక్యూ" అని హుషారుగా సైకిలెక్కి 'పగలే వెన్నెలా' పాట గుర్తుకొచ్చి ఈలపాట పాడుకొంటూ హాస్టలు చేరుకొన్నాడు అనంతం.

ఈ సంఘటన అనంతరావులో గొప్ప మార్పునే తెచ్చింది. ఆనాటి నుంచీ మహా హుషారుగా ఉంటూ కాస్త మనిషిగా మారి పోసాగాడు. అతని గుండెకాయ బయలు ప్రపంచంలోకి వచ్చి ఎక్కడెక్కడో ఆనందంగా విహరించసాగింది. రోజూ తియ్య తియ్యని కలలు కనడం మొదలెట్టాడు.

ఫ్రెండ్సంతా పీ వీ లో అన్నపూర్ణ, అనంతరావు మీద జోకులేస్తూ కాలక్షేపం చేస్తూంటే, అతగాడు ప్లేగ్రౌండులో పిల్లి మొగ్గలూ, కుప్పిగంతులూ వేస్తున్నాడు తనలో ఏదో మార్పు సంభవించేసినట్టు. శరీరమంతా తేలికయిపోయి ఆగనే పైగాల్లో తేలిపోతున్నట్టు ఫీలయ్యాడు. హైజంప్, లాంగ్ జంప్, పులప్స్, డిప్స్ బస్కీలు, అన్నింటోనూ అనుకోని ఇంప్రూవ్‌మెంట్. చాంపియన్ షిప్ ఈ యేడు తనదేనని కొండంత ఆత్మధైర్యంతో సంబరపడి పోయి, దగ్గరలో ఎవరూ లేకపోవడం

## జీవిత పరమార్థం

జీవిత పరమార్థం ఏమిటి?, అని వేదాంతులను అడిగితే పారమార్థిక సాధన చేసి, మోక్షం సంపాదించడమే అని అంటారు. ఇతరులను అడిగితే సరియైన మార్గంలో కాలం వెళ్ళబుచ్చుతూ కీర్తి ప్రతిష్ఠలు సంపాదించడమూ, సుఖంగా జీవించడమూ అని అంటారు. చాలా మందికి ఈ రెండవ పద్ధతే బాగా నచ్చుతుంది మొదటి పద్ధతి ఉత్తమమైనదే కాని, అందరికీ అది సాధ్యం కాదు. సామాన్య జనుడికి లౌకిక ముల మీదనే సులభంగా దృష్టి ప్రసరిస్తుంది.

పతి మానవునికీ తాను సుఖించాలనే



## అన్నపూర్ణా ఆర్కిమెడీసు

చూసి మీసాలు మెలేసి, కళ్ళజోడు లేకపోవడం వల్ల నేళ్ళలో గడ్డం మాత్రం తడుము కొని రొడలు చరచుకొని గర్వంగా బ్రీతింగ్ ఎక్సర్‌సైజు మొదలెట్టాడు.

తర్వాత ఓ రోజున లైబ్రరిలో అనంతరావును చూసి పలకరింపుగా చిరునవ్వు విసిరింది అన్నపూర్ణ. అనంతరావు గుండె ఆనందంతో నిండిపోయింది. ఆమె అంత ఆపేక్షగా నవ్వుతూంటే మనం నవ్వకపోతే ఆమె మనస్సు గాయపడదా అనుకొని వెను వెంటనే దర్జాగా రిప్లయ్ చిరునవ్వు విసిరేశాడు అనంతం. వాళ్ళు ఫైనలియర్‌లోకి అడుగు పెట్టేసరికల్లా చిరునవ్వులు విసురుకోవడం, విష్ చేసుకోవడం, లెసన్సు డిస్కస్ చేసుకోవడం స్టేజి దాటి ఒకర్నొకరు తమకు తెలీకుండానే అభిమానించుకోవడం మొదలెట్టారు. వారి స్నేహం కాంటీన్, లైబ్రరీల నుంచి రామకృష్ణా బీచ్‌వరకూ, అక్కడి నుంచి జగదాంబా సెంటర్ వరకూ సాగి క్రమంగా పెరిగి పెద్దదై పుష్పించ సాగింది.

* * *

ఆ చల్లని సాయంత్రం బీచ్ అంతా అందంగా కళకళలాడుతోంది. ఒడ్డుపట్టి ఇసుకలో కూరుకుపోయిన పెద్ద పడవ వెనుక, జనం అంతగా మసలని చోట మెత్తటి ఇసుకలో కూర్చున్న అన్నపూర్ణ ఒడిలో తల పెట్టుకొని కాలిమీద కాల

# ధర్మపథం

కోరిక ఉంటుంది దుఃఖించాలని ఎవ్వరూ కోరరు. తన సుఖం కోసం ఎన్నో ఉపాయాలను ఆలోచించడం మానవునికి సహజం వాటిలో కొన్ని ఇతరులకు కష్టం కలిగజేసేవి ఉంటాయి కష్టం కలిగజేయనివీ ఉంటాయి. వాటిలో - ఇతరులను బాధపెట్టే తన్మార్గంగా తాను సుఖించదలచుకోవడం ఎంత మాత్రం తగదు. ఏ ఉపాయమైనా ధర్మబద్ధమయి ఉండాలి.

ప్రతి నారికీ త్రికరణశుద్ధి అవసరం. త్రికరణ శుద్ధి అంటే మనోవాక్కర్మలలో పరిశుద్ధి మనస్సులో ఆలోచించే ఆలోచన ఉత్తమమైనదై ఉండాలి దానికి మనో నైర్మల్యం అవసరం. ఆ ఆలోచనకు తగిన విధంగా- పలికే మాట, ఆ మాటకు తగినట్లు తాను చేసే పని ఉండాలి. అలాగే దొకటి చెప్పే దొకటి, చేసే దొకటీ ఉండకూడదు.

ఈ విధంగానే- జీవిత ప్రయోజనాన్ని సాధించే పద్ధతుల మూడు ఉన్నాయి. అవి- న్యాయమైన జీవితము, న్యాయముగా ఆలోచించుట,న్యాయమైన పనులొనరించుట ఇవి సామాన్య మానవుని కనీస ధర్మములు. ఆ కనీస ధర్మముల ననుసరించి జీవయాత్ర చేసిన చాలును. మనం ఇతరులకు ఉపకారం చెయ్యడం సాధ్యం కాకపోవచ్చు. త్యాగం చెయ్యలేక పోవచ్చు మన మట్టుకు మనం న్యాయంగా ఉంటే లోకానికి మహోపకారం చేసినట్టే. ఈ ధర్మాలను గుర్తించనివాడు ఎట్టి ఘనకార్యాలు చేసినా ప్రయోజనం ఉండదు అందరూ ఈ పద్ధతులను అనుసరిస్తే, ఎన్నో సమస్యలు వాటి అంతట అవే తీరిపోతాయి. ఈ ధర్మ సూక్ష్మన్ని గ్రహించే గాంధీ మహాత్ముడు ఈ ఉపదేశం చేశాడు.

మరే ఘనకార్యాలను సాధించి న్నా సాధించలేక పోయినా, పయిమూడు మార్గాలనూ అనుసరించి తన జీవితాన్ని ప్రశాంతంగా సాగించి, ఇతరులకు ఆదర్శప్రాయంగా ఉండడం అవసరం. పారమార్థిక దృష్టి లేనివారైనా సరే, వీటిని ఆచరణలో పెడితే పరమార్థాన్ని సాధించినట్లవుతుంది.

*- బులుసు వేంకట రమణయ్య*

---

వేసుకొని శేషశాయిలా నిద్ర నటిస్తున్నాడు అనంతం.

"అనంతం అటు చూడు, ఆ కెరటాలపైకంటూ ఎగిరి అందంగ ఎలా విరుచుకు పడుతున్నాయో" అంది అన్నపూర్ణ.

"మిస్టర్ అనాయ్యకాన్" అంది మళ్ళీ.

"మై డియర్ ఆర్కిమిడీస్" అందామె.

వెంటనే ఉలిక్కిపడి లేచి కూర్చుని "ఏమిటి పూర్ణా" కళ్ళజోడు వత్తుకొని గడ్డం తడుముకొంటూ అన్నాడు.

పగలబడి నవ్వింది అన్నపూర్ణ. అయోమయంగా చూశాడు అనంతం.

"ఆర్కిమిడీస్ అంటే నీ కంత అభిమానం ఎందుకు?" నవ్వుకొంటూ అందామె.

"హైస్కూల్లోనే మనకా పేరొచ్చింది గాని. ఆర్కిమిడీసంటే నీకు అభిమానం లేదూ" అన్నాడు

"ఏ ఆర్కిమిడీసు?" చిలిపిగా అడిగింది.

"ఇద్దరున్నారా ?" అన్నాడు అనంతం.

"అయితే వుందనుకో" అంది.

"అనుకోడు. వుంది అనాలి."

"ఎందుకటా ?"

"ఏమో నాకు తెలీదు" సిగ్గుపడుతూ అన్నాడు అనంతం.

"నీ సిగ్గు బంగారంగానూ" అంది అన్నపూర్ణ అతనివంక నూటిగా చూస్తూ.

"ఆర్కిమిడీసు మీద ఈ మధ్య నాకు మరీ గౌరవం పెరిగిపోయింది" అన్నాడు.

"ఎందుకటా ?"

"మనల్ని కలిపింది ఆయనేకదా ?" మళ్ళీ సిగ్గుపడ్డాడు అనంతం.

"నిజమా" ప్రశ్నించింది అన్నపూర్ణ.

"నిజం, ఆర్కిమిడీస్ మీద ఒట్టు."

"పోవోయ్ బడాయ్"

"బడాయ్ కాదు, నిజం."

"అనంతం తన హృదయాన్ని ఎప్పుడు పోగొట్టుకున్నాడో తెలుసా ?"

"కవిత్వమా లేక పైత్యమా ?" అంది అన్నపూర్ణ కొంచెం వెటకారంగా.

"కాదు... కాదు... సైన్సు... కొత్త థీరీ" అన్నాడు అనంతం.

"ఏమిటట ? ఇంతకూ యురేకా యురేకా అన్నానా లేదా ?"

"కమింగ్ టు ది పాయింట్..."

"ఒక వస్తువు నీటిలో పూర్తిగా మునిగినప్పుడు కొంతబరువునుకోల్పోయినట్లుఅగుపడును. అట్టు కోల్పోయినబరువు ఆవస్తువు నీటిలో మునిగినప్పుడు పక్కకు తొలగించబడిన నీటి భారమునకు సమానం అవునా? అలాగే..."

"అవును. ఇది ఆర్కిమిడీసు సూత్రం"

"నన్ను పూర్తిగా చెప్పనివ్వు పూర్ణా"

"సారీ... ప్రొసీడ్"

"...అలాగే ఒకరు ప్రేమలో పూర్తిగా మునిగినప్పుడు తన హృదయమును కోల్పోదురు. అట్లుకోల్పోయిన హృదయము తాను ప్రేమించిన యువతిని లేదా యువకుణ్ణి చేరును. అట్లు చేరిన హృదయము భారము అతని లేదా ఆమె హృదయభారమునకు ఐ మీన్ ప్రేమ భారమునకు సమానముగా ఉండును."

"వండర్‌ఫుల్. థీరీకి జోహారు" అంటూ అన్నపూర్ణ చిన్నపిల్లలా ఫక్కున నవ్వి చిన్నగా చప్పట్లు చరిచింది.

అనంతం కళ్ళజోడు వెనక్కు వత్తుకొని మళ్ళీ చెప్పడం మొదలు పెట్టాడు.

"అన్నపూర్ణ హాస్టలు గేటు దగ్గర ఫక్కున నవ్వినప్పుడు అనంతం తన హృదయాన్ని కోల్పోయాడు. అందువల్ల శరీరం తేలికై అల మేఘాల్లో తేలుతూ చాంపియన్ షిప్పునూ, పూర్ణనూ కూడా గెలిచేసుకొన్నాడు." అని ఆమె వంక చూసి సిగ్గుపడుతూ చిరునవ్వు చిందించాడు.

"సిద్ధాంతం గొప్పగా ఉందిగాని, ఓ చిన్న సందేహం. అనంతం కోల్పోయిన హృదయ భారాన్ని తిరిగి అన్నపూర్ణహృదయ భారం భర్తీ చేసినప్పుడు అతను గాల్లో ఎలా తేలగలిగాడు మహాశయా?" అంది అన్నపూర్ణ.

"...అదా . అదా... భర్తీ అవడానికి మధ్య కొంచెం గ్యాప్‌ఉంది ఉండాలి. అయినా అనంతం హృదయం కంటే అన్నపూర్ణ హృదయం కొద్దిగా చిన్నది కదా...ఐ మీన్ .. ఐ మీన్..."

"నా పిచ్చి అనంతం..." అన్నపూర్ణ అనంతరావుని మాట్లాడనీయకుండా ఉక్కిరి బిక్కిరి చేసింది

# ప్రేమపాశం

**శ్రీమతి ప్రమీలా జనార్దన్**

*(గత సంచిక తరువాయి)*

"జానకీ నన్ను పూర్తిగా దూరం చేస్తున్నావు" మంచం మీద పరుపు సరిచేసి పిల్లల గదిలోకి వెళుతున్న జానకితో నిష్ఠూరంగా అన్నాడు మనోహర్.

"మీ తలపులు పూర్తిగా నావి గాని దురదృష్టం నాదని తెలిసిన తర్వాత ఇక కోరిక లెక్కడుంటాయండి? నాలో ప్రేమను మీ కందించానని తృప్తి చెందాను. కాని తిరిగి పరిపూర్ణంగా నేనందుకున్నానా లేదా అని ఆలోచించలేదు. మీ మంచితనం నాకసలా అనుమానం రానివ్వలేదు. కాని మంచి మనసు మీద అధికారి కాలేదు. మీరు కోరుకున్నది మీకు దక్కించానన్న తృప్తి నాకు మిగలనివ్వండి. శారీరకంగా మిమ్మల్ని చేరలేకపోయినా, మానసికంగా మీ కెప్పుడూ చేరువగానే వుంటాను. అది నాకు తెలుసు, మీకు తెలుసు."

"జానకీ, నాకమృతాన్నిచ్చి..." అతడి మాటలు పూర్తిగాక ముందే అంది. "హాలాహలం మింగాలనుకోడం లేదు. మీ నీడన నా జీవితం వెళ్ళిపోవాలి. నా పిల్లల అభివృద్ధిని కండ్లారా చూడాలని వుంది."

జానకి ఆరోజన్న మాట ఆచరణలో కూడా పెట్టడంవల్ల, వారిద్దరి మధ్య దూరం పెరిగిందనే చెప్పాలి.

మనోహర్ డిస్పెన్సరీ ఇంటిదగ్గర కాక పోవడంవల్ల, అతడొక్కొక్కసారి రెండు మూడు రోజులు ఇంటికి వచ్చేవాడు కాదు. అప్పుడు జానకి పడే బాధ వర్ణనాతీతం.

"నాన్నను పిలుచుకొని రానా అమ్మా?" అప్పుడప్పుడే లోకాన్నర్థం చేసుకుంటున్న విజయ్ తల్లి వంక బాధగా చూసి అనేవాడు.

"వద్దు బాబూ, పిలవకుండా రప్పించేది మమత. పిలిచి రప్పించేది బాధ్యత. మమత లేకుండా బాధ్యత తీసుకోడం నాకిష్టం లేదు." అనే తల్లి మాటలు అర్థంగాక పోయినా, ఆమెకు తండ్రి పిలిస్తే రావడం మాత్రం ఇష్టంలేదని తెలుసుకున్నాడు.

శాంతితో జీవితం మధురంగా వుంది మనోహర్‌కు.

వయస్సూ, మనస్సూ పురకలు వేసే తరుణంలో జానకి అతడి జీవితంలోకి ప్రవేశించింది. ఎంత ఆనందం లభ్యంగాక పోయేందుకు కారణం ఇంటి వాతావరణమేనేమో!

అడుగడుక్కూ తప్పులు వెతక ప్రయత్నించి, కటువు బాణాలు విసురుతుండే తల్లిదండ్రుల ముందు, తోబుట్టువుల ముందు జానకితో స్వేచ్ఛగా మాట్లాడాలన్నా జంకుగా వుండేది.

యాంత్రికమైన ఆ జీవితం జానకికెలా వున్నా అతడికి మాత్రం అసంతృప్తిగానే



**జరిగినకథ 6:** తోటి డాక్టర్లు, కొడుకు విజయ్ బలవంతము చేయగా భార్య జానకికి ఆపరేషన్ చేసి ఆమెను కాపాడిన డాక్టర్ మనోహర్‌కు డాక్టర్ శాంతి వల్ల మారిన తన వైవాహిక జీవితం గుర్తుకొస్తుంది. తన జీవితం తనవారి ఉన్నతికి పునాది కావాలని అనుకొన్న శాంతి, వాళ్ళ అవహేళనలకు గురౌతుంది. మనోహర్‌ను అపార్థం చేసుకొన్నానని బాధపడి, అతనికి క్షమాపణలు చెప్పుకోటానికి వాళ్ల ఇంటికి వెళ్తుంది. అక్కడ మనోహర్ జానకిని హింసించటం చూచిన శాంతి అతనిని అసహ్యించుకుంటుంది. అపుడు అతడు జానకి వెనుకటి వృత్తాంతము ఆమెతో చెప్తుంటాడు. తన తల్లిదండ్రులను ఎదిరించి మేనమామ కూతురు జానకిని పెళ్ళిచేసుకొంటాడు మనోహర్. కట్నం రాలేదనీ, తన కొడుకుకి అత్తవారింట జరగవలసిన ముచ్చట్లు ఏవీ జరపలేదనీ మనోహర్ తల్లిదండ్రులు జానకిని హింసిస్తారు. భర్త మనసు అర్థం చేసుకున్న జానకి సహకారంతో శాంతి, మనోహర్‌ల వివాహం జరుగుతుంది

వుండేది. తను దేనికో దూరమైనట్లు బాధ కలిగేది.

పనితో, పోటిపోటి మాటలతో అలసి సొలసి అర్ధరాత్రౌతుండగా గదిలోకి వచ్చే భార్యను చూస్తే బాధ జాలి కలిగి, తానున్నానని ధైర్యం చెప్పాలనిపిస్తుందే తప్ప చిలిపి వూహలు రేగవు.

వాళ్లతోపాటు తనూ జానకిని కోప్పడడం లేదని ఇంట్లో అందరూ అంటుంటే జానకితో తను చనువుగా వుండడం, అధికంగా మాట్లాడడం, ఆమెకు మరింత బాధ కలిగించేందుకు హేతువు లౌతాయని పించేది. కాలక్రమేణా ఆ వాతావరణానికి అలవాటు పడిపోయాడు.

కాని ఇప్పుడు మళ్ళీ క్రొత్త జీవితంలోకి ప్రవేశించిన అతడికి అణగారిన ఆశలు చిగురించి, జీవిత మాధుర్యాన్ని తెలుపుతుంటే అతడికి ప్రపంచమే క్రొత్తగా కనిపిస్తోంది.

దాంపత్యజీవిత మొక్కటే భార్యాభర్తల సన్నిహితం చెయ్యలేదనిపిస్తుంది అతడ్ని చూస్తుంటే.

మానసికంగా బాగా దగ్గరికి వచ్చినప్పుడే ఆలుమగల అనుబంధం గట్టిపడుతుంది.

అతడికి జానకిమీద, పిల్లల మీద అభిమానం తరగలేదు.

సినిమాలకు షికార్లకు వెళ్ళడం, ఇంటి ముందున్న లాన్‌లో కుర్చీలు వేసుకొని కూర్చొని కబుర్లు చెప్పుకోడం... హాయిగా గడిచిపోతున్నది కాలం.

"శాంతీ, మనం ఇక్కడుండడం బాగుండదు." అన్నాడొకరోజు మనోహర్.

"జానకీదేవి మీ ప్రేమలో భాగంఇచ్చారు గాని, ఆ ఇంట్లో నాకు స్థానమివ్వనన్నారు." అతడి భావం అర్థమైన దానిలా అంది.

"జానకికిష్టంలేనిదేమీ చెయ్యొద్దు." అతడు మనస్ఫూర్తిగా అన్నాడు. "మరో ఇల్లు చూద్దాం."

"ఏం, ఇక్కడ బాగోలేదా?"

ఇబ్బందిగా చూశాడు. "అలా అని కాదు..."

"మనూ, మీ అభిప్రాయం నాకు తెలుసు. మీ ఇల్లు కానప్పుడు మరెక్కడో వుండేబదులు ఇక్కడే వుందాం. నాకోసం కొన్నాళ్ళు ఇబ్బంది పడక తప్పదు నా మీద ఆధారపడ్డ తమ్ముడు, చెల్లెళ్లను ఒక దోవలోకి తేవాలి."

"ఆల్‌రైట్ ఒప్పుకున్నాను మేడమ్"

ఆమె భుజం మీద చెయ్యివేసి దగ్గరికి లాక్కున్నాడు.

అతడికి నచ్చచెప్పిన నాలుగు రోజులకే "అతడి పద్ధతి నాకు నచ్చలేదు" అంటూ చిటపట లాడింది కమలమ్మ.

"యేమిటంత నచ్చనిది ?"

"అతడిక్కడే వుండడం."

"వుండకూడదా ?"

"ఇది అతడి ఇల్లు కాదు."

"ఐసీ." అని క్షణం ఆలోచిస్తున్నట్టుగా వుండి అంది.

"అతడి విషయం హెచ్చరిస్తే, అవివేకంగా అతడ్ని ఇక్కడుండేందుకు ఒప్పించాను. కనీసం ఇప్పటికైనా నిజం తెలుసుకున్నాను. ఇక వెళ్ళిపోతాం."

"శాంతీ" ఈసారి కమలమ్మ గొంతు తగ్గు స్వరంతో పలికింది.

"అదికాదే, యెదిగిన పిల్లలింట్లో వుండగా, మీరలా సినిమాలకు, షికారుకు..."

"వెళ్ళడం తప్పా ?" కోపాన్ని నిగ్రహించుకోలేకపోతున్నది.

"అయితే నేనిప్పుడు కూడా పూర్వపు శాంతిలా, మీ కోసం బతికే మనిషిలా బ్రతికితే మంచి దంటావు. అంతేనా ?"

"నిన్న కిరణ్ డబ్బు కావాలంటే లేదన్నావట."

"ఔను మాధవి నిక చదువు చాలించమన్నాను. రాధికను వుద్యోగం చూసుకోమన్నాను."

"దీనికి కారణం అతడు కదూ ?" కోపంగా చూసింది కమలమ్మ

"కాదు, మీరే నాలో లేని స్వార్థాన్ని, కుత్సితత్వాన్ని ఊహించుకున్నారు. ప్రేమతో బాధ్యతలను తల కెత్తుకుంటే మనిషిని కాదన్నారు. అవసరమైనంత వరకు వాడుకొని పారేసే వస్తువులా కాకుండా వుండాలనుకున్నాను." అని తల్లికి చేరువగా వచ్చి చురుగ్గా చూస్తూ "చివరికి నేను భర్తతో హాయిగా వుంటే, భరించలేకపోతున్నావంటే ఈ వయసులో పెండ్లి చేసుకున్న నేను మిమ్మల్ని కాదంటానేమో అని భయం. మీకా భయం అక్కర్లేదు. కిరణ్‌కు వుద్యోగం వచ్చేవరకు నా బాధ్యత నేను స్వీకరిస్తాను. కాని ఇప్పుడు నేను వివాహితనన్న విషయం గుర్తించుకొని ఖర్చుపెట్టడం, ప్రవర్తించడం అవసరం. ఈ ఇల్లు అతడిది కాదన్నావు కదూ! అతడికి లేని హక్కు, స్వేచ్ఛ నాకూ వద్దు" అంత ఆవేశమూ ఆవేదనగ మారి బొంగురుపోయిన గొంతుతో అంది.

"అమ్మా, కిరణ్, మాధవి రాధిక లాగే నేనూ పుట్టాను. నా గురించి వాళ్ళు కొన్ని మాటలకు వంత పాడినందుకు క్షోభ పెడతావమ్మా? నేనూ నీ బిడ్డనే. అందరి లాంటి మనిషినే. నాకూ ఆశలు, ఆశయాలు వున్నాయి. నేను నా భర్తతో ఆనందంగా వుండడానికోసం తప్పా? మనసుకు నచ్చని వాళ్ళేపని చేసినా తప్పుగా కనిపిస్తుందనేందుకిదే ఉదాహరణ. ఇక మిమ్మల్ని బాధ పెట్టను. ఈ ఇంట్లో నేనుండనమ్మా" దుఃఖం పొంగుకొస్తుంటే గబుక్కున తన గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుంది.

* * *

"జానకీ, యేమిటిలా అయిపోయారు?" శాంతి ఇంట్లోకి అడుగు పెట్టగనే జానకిని చూసి ఆశ్చర్యపోయింది.

జానకి బాగా చిక్కిపోయింది. కండ్లు లోతుకుపోయి మనిషి పాలిపోయింది. దుస్తి ముసుకున్న తీరు ఆమెకు దేని మీద ఆసక్తి లేదని తెలుపుతోంది.

వంటింట్లో పొయ్యిమీదేదో చూసేందుకు వెళ్ళిన జానకితో పాటు శాంతి కూడా వెళ్ళింది.

"కూర్చోమ్మా" అంటూ వంటింట్లోనే పీట వెయ్యబోతుంటే, "నీ విదివరకు మా అతిథివి. మర్యాద చేశారు. ఇప్పుడు నేనూ ఈ ఇంట్లో మనిషినే. మీలా నాకూ వుంది" అంటూ వారించి పీట పెట్టింది.

"అంత దగ్గరదానివైనా మరి నన్ను 'మీరు' అంటూ దూరంగానే వుంచుతున్నావుగా." నవ్వింది జానకి.

"ఆ విషయంలో నన్ను మన్నించండి. నా మదిలో మీ స్థానం యే దేవతా అలంకరించలేదు. దేవతలా పిలిచినా పలుకుతాడు. యెక్కడ వుంచినా వుంటాడు. కాని అది మన మనసుకు తృప్తి కలిగించేలా వుండాలిగా."

"మనిద్దరి వయసు ఒకటే అయినా మిమ్మల్ని మన్నించకుండా వుండలేకపోయేందుకు కారణం మీమీద ఆరాధన"

"దేవుడిలా ఆరాధన అందుకుంటూ మనుషులకు దూరమవ్వ మంటావు. అంతేనా ?" నవ్వుతూ అంది జానకి.

"దూరమవ్వడం కాదు. వారి గుండెలలో మమతా మూర్తిగా నిలిచిపోతారు. మీ ఓర్పు, సహనం, త్యాగశీలత యెదుటివారి గురించి తాపత్రయ పడేట్లు చేస్తుంటే మనుషుల కెక్కడ దూరమౌతారు ?" అంది శాంతి.

లలిత సుమిత పెండ్లైన తర్వాత తొలిసారి ఇంటికి వచ్చిన శాంతిని అపరిమితంగా గౌరవించారు.

ఆమెకు పెరట్లో పూసిన పూలు కోసి మాలకట్టి ఇచ్చారు. తమ తమ కుట్టు



వసుల శ్రీ పుణ్యత చాలక ఫైర్ బ్యాగులను, డోర్ కర్టెన్‌లను చూపించారు ఆమె అందాన్ని మెచ్చుకున్నారు. ఆమె వుద్యోగాన్ని అంతకన్నా మెచ్చుకున్నారు. శాంతి వాళ్ళతో పాటు తిరుగుతున్నా యేదో లోచిస్తునే వుంది.

"లలితా నామీద కోపంగా లేదూ ?" అకస్మాత్తుగా అడిగింది.

"యెందుకు ?" యెదురుప్రశ్న వేసింది లలిత.

"అన్నయ్య ఇష్ట పడి చేసుకున్నప్పుడు మాకెందుకు కోపం ? అయినా యెవరి చదువు సంస్కారానికి తగిన వాళ్ళను వాళ్ళు చేసుకోవాలి. అన్నయ్య డాక్టర్. మీరూ డాక్టర్. ఆ వదినేం చదివిందని ?" సుమిత్ర జవాబు చెప్పేసరికి శాంతి మనసు కలుక్కుమన్నది. తన రాకతో జానకి మరో మెట్టు క్రిందికి జారిపోయినట్లనిపించింది.

వరండాలో మెట్ల మీద కూర్చొని మాట్లాడుకుంటున్న స్వర్ణ, కల్పనలను చూసి "ఇలా రండమ్మా" అంది ప్రేమగా.

"ఉహూం." తల అడ్డంగా తిప్పి అక్క ప్రక్కకు జరిగింది కల్పన

"యెందుకు రావు ?" దగ్గరగా వస్తూ అడిగింది. అప్పుడే విజయ్ ట్యూషన్ నుండి వచ్చాడు.

"మా నాన్న మీ ఇంట్లో వున్నాడటగా" అరిందాగా అడిగింది స్వర్ణ.

"యెవరు చెప్పారు ?"

"అన్నయ్య". విజయ్ వైపు చూసింది.

# ప్రేమ పాశం

"ఇక ఇక్కడికి రారా ?" స్వర్ణ మాటలు హృదయాన్ని కలచివేశాయి. 'తను అన్యాయంగా ప్రవర్తించిందా ?' మనోహర్ ఇక్కడికి రాక వారం రోజులయింది. ఆపరేషన్ కేసు వుందని ఈరోజూ తనతో రాలేదతడు. పిల్లలు తండ్రి కోసం యెంత ఆరాటపడుతున్నారో అర్థమయింది. 'ఆ పిల్లలకు తండ్రి ప్రేమ దూరంచేసే హక్కు తనకు లేదు.'

"మీ నాన్న దగ్గరికి తీసుకెళతాను, వస్తావా ?" అడిగింది.

"రాదు." విజయ్ వచ్చి స్వర్ణ చెయ్యి పట్టుకున్నాడు

"అమ్మ నొదిలి నేను వుండలేను. అమ్మ నమ్మల్నొదిలి అసలు వుండలేదు. ప్లీజ్ మీరిలా మా చెల్లెళ్ళను తీసుకెళతానని మాత్రం అనవద్దు." అని ఇక అక్కడ వుంటే బలవంతంగా లాక్కెళుతుందేమో నన్నట్లు ఇద్దర్నీ తన వెంట లోపలికి తీసుకెళ్ళాడు.

కొయ్యబారిపోయింది శాంతి ఆ పసి మనసులో, తన ప్రియాతి ప్రియమైనదాన్ని దోచుకుపోయానన్న భావనతో తన మీద ద్వేషం యేర్పడింది. అది తను భరించలేదు. తనిలాగే వుంటే ఇకముందేం జరుగుతుందో? తనవల్ల మనోహర్ కాని, అతడి కుటుంబం కాని కష్టపడకూడదు నష్టపడకూడదు. జానకీదేవి త్యాగానికి కన్నీరే ఫలితం కాకూడదు. విజయ్ ప్రవర్తన ఆమె నమితంగా కదిలించి భవిష్యత్తు గురించి మరుగ్గా ఆలోచించేట్లు చేసింది.

శిలలా నిలబడివున్న ఆమె దగ్గరకు గబగబా వచ్చింది లలిత.

"వాడి మాటలు మీరేం పట్టించుకోకండి వదినా. వాడికి మహా తల పొగరు. పెధవ రెండు అంటించి వచ్చాను పెద్దా చిన్నా లేకుండా మాటాడతాడు."

కలవరంగా చూసింది శాంతి.

"విజయ్‌ని కొట్టావా ? వాడిప్పుడేం చేశాడు!" ఆ దెబ్బలు తనకే తగిలినంత బాధగా వుంది.

"ఇంకేం చేయాలి? మీతో అలా మాట్లాడడం తప్పు కాదూ?"

శుష్కహాసం చేసింది శాంతి.

'తప్పా? యేది తప్పు? యెవరిది తప్పు? తను ప్రేమించడం తప్పా? ప్రేమించినవాడ్ని పొందడం తప్పా? తన తండ్రి తనకు కాకుండా పోతున్నాడని బుద్ధి వికసిస్తున్న ఆ పిల్లవాడు తన నసహ్యించుకోడం తప్పా? తన హోదా, వుద్యోగం చూసి గౌరవిస్తున్న ఈ లలిత, సుమిత్రలది తప్పా?

యేది తప్పో, యేది ఒప్పో తను తెలుసుకోలేదు కాని ఇయింట మార్పు రావాలని ఖచ్చితంగా చెప్పగలదు. అలా జరక్కపోతే తనకు అశాంతే మిగులుతుంది.'

లోపలి నుండి విజయ్ యేడుపు సన్నగా వినిపిస్తుంటే, అక్కున చేర్చుకొని ఓదార్చాలని లోనికి వెళబోతున్న క్షణమే, అంతకు ముందతడి కండ్లలో కనిపించిన యేహ్యత గుర్తొచ్చి కాళ్ళు కదపలేక పోయింది.

'ఇలా జరిగినందుకు ఆ తల్లి యెంత బాధపడుతున్నదో?'

జానకి రూపం మదిలో మెదలగానే ఇక అక్కడ నిలవలేక "వస్తాను లలితా" అంటూ ఆమె పిలిచినా వినిపించుకోకుండా చరచర బైటికి వచ్చేసింది

ఇంటికి వెళ్ళాలని ఆటో యెక్కిన శాంతికి ఇంటికి వెళ్ళాలనిపించలేదు. తొందరగా మనోహర్‌తో మాట్లాడాలనిపిస్తుంటే హాస్పిటల్ ముందు దిగింది.

అప్పుడే ఆపరేషన్ థియేటర్ నుండి వెలుపలికి వచ్చిన మనోహర్ శాంతిని చూసి "యెందుకు మళ్ళీ వచ్చావు?" అని అడిగాడు.



# 3 నెలలు వచ్చిన తర్వాత, పాలు మాత్రం యిస్తే చాలదు



## డాక్టర్లు సిఫార్సు చేస్తారు



# ఫారెక్స్®

## మీ పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

**డాక్టర్లు ఫారెక్స్ సిఫార్సు చేస్తారు! ఎందువల్ల?**

ఎందుకంటే, ఇది మీ పాపాయి ఘన ఆహారం తీసుకోవడం ప్రారంభించే సమయంలో అతడి అవసరాలను తీర్చే సంపూర్ణ సంతులిత ఆహారం. పాపాయి సున్నితమైన జీర్ణకోశానికి సరిగ్గా తగిన ఆహారం.

**ఫారెక్స్ ఏ విధంగా పాపాయికి తగిన సంతులిత ఆహారం?**

ఫారెక్స్ మెదడు, శరీరం పెరుగుదల కోసం తగినన్ని సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను, శక్తి కోసం కార్బోహైడ్రేట్లను, దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళు పెరిగేందుకు తగినంతగా కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి అందిస్తుంది. అన్నిటికంటె ముఖ్యంగా, పాపాయి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ అందజేస్తుంది.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు?**

ఈ వయస్సులో పాపాయికి నమలడం అలవాటు కావాలి. లేకపోతే నమలకుండా మింగివెయ్యడం వల్ల కడుపు నొప్పి వచ్చి అతడి పెరుగుదల దెబ్బ తినవచ్చు.

అంతే కాకుండా, 3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా సున్నితంగానే ఉంటుంది. అందుకే మామూలు ఘన ఆహారాలకు బదులు అతడికి ప్రత్యేకంగా తయారు చేయబడిన—అంటే సులభంగా జీర్ణమయ్యే—పిల్లల ఘన ఆహారం అవసరం.

**'పెద్దలు తినే' ఆహారాన్ని ఎప్పటినుంచి ఇవ్వవచ్చు?**

పాపాయి మొదటి సారిగా తప్పటడుగులు వేసినప్పుడు అతడు పెద్దలు తినే ఆహారాన్ని తీసుకోగలుగుతాడు. కొంచెం ఆలోచించి, మీ పాపాయి తినేవాటన్నిటిలో ఫారెక్స్ కలిపి ప్రేమగా పెట్టండి.

ఇప్పుడు అదే శ్రేష్ఠమైన ఫారెక్స్ కొత్త 400 గ్రాముల డబ్బాలో వస్తోంది




## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-2-233 TL

# ప్రేమపాశం

"చెప్తాను. పని అయిపోతే బైల్దేరండి" అంది.

అయిదు నిమిషాల తర్వాత ఇద్దరూ హాస్పిటల్ వెలుపలికి వచ్చారు.

"నేను మీ యింటి నుండి వస్తు న్నాను." ఉపోద్ఘాతంగా అంది.

"అలాగ!" అక్కడేదో జరిగి వుంటుం దనుకున్నాడు.

"మనం ఇన్నాళ్ళు అన్యాయంగా ప్రవ ర్తించాం."

"శాంతి, యేమిటి నువ్వనేది?" అందో ళనగా చూశాడు.

"ఔను. నేనీరోజే ఆ విషయం తెలుసు కున్నాను" అని అతడి చెయి తిరిగి "రేప ట్నుంచి మన నివాసం మీ యింట్లోనే" అంది.

"జానకి వద్దన్నదని నువ్వేగా చెప్పావు?"

"నిజమే. ఆమె మాటకు కట్టుబడి వుంటే ఆమె, పిల్లలు దుర్భర జీవితం గడుపుతారు. ఆ పిల్లలకు తండ్రి ప్రేమ కావాలి ఆ ఇల్లాలికి భర్త ఆదరణ కావాలి. అవి లోపిస్తే ముందే హీనంగా చూసేవారి వింకా అధ్వాన్నంగా చూస్తారు. వాళ్ళ బ్రతు కులు విక్షిప్తంగా తయారౌతాయి. దానికి బాధ్యులెవరౌతారు?"

"శాంతి..." వినలేనివాడిలా చూశాడు.

"అనుకోనేందుకు బాధెందుకు? అలా జరిగిందంటే, కారణం మనమే. మన స్వార్థం కోసం వాళ్ల జీవితానందాన్ని బలి తీసుకుంటున్నామన్న మాట."

"ఇప్పుడేం చెయ్యాలి?" అతడికి తోచడం లేదు.

"జానకి కిష్టం లేదని తెలిసీ..."

"వెళ్ళక తప్పదు" త్రోవలో వున్న పార్కు వైపు దారి తీసింది శాంతి.

బెంచీమీద కూర్చున్నారిద్దరూ.

శాంతి భవిష్యత్కార్యక్రమాలు వివరిస్తోంది.

మనోహర్ వాటి గురించే ఆలోచిస్తు న్నాడు.

"శాంతీ, యెందుకిలా నిర్ణయించు కున్నావు?" శాంతి అక్కడ వుండేందుకే వచ్చానని చెప్పగానే నివ్వెరపాటుగా అడిగింది జానకి.

త్వరలో

సుదూర తీరాలు

సీరియల్

"మిమ్మల్ని బాధ పెట్టాలని మాత్రం కాదు..."

"నాకు తెలుసు శాంతీ. కాని ఈ ఇంట నువ్వు." మాటలు పూర్తిచెయ్యలేక పోయింది.

"శాంతంగా వుండలేనం గారు కదా?" జానకి మాట్లాడలేదు

"జానకీ డబ్బు కారణంగా మీరు సుఖపడలేరు అదే కారణంగా ఇప్పుడు నేను సుఖపడలేననుకుంటున్న మీ భావా సహజ మైనదే. డబ్బున్నా కష్టమే లేకున్నా కష్టమే. కాని..." ఆమె స్వరం గంభీరంగా మారింది.

"అనుభవాల వల్ల మనుషులను చదివే నేర్పు సంపాదించాను. అన్నిటిని మించి మీ మంచితనం సదాగా వుంటుంది. ఇక నేను బాధపడే ప్రశ్నే లేదు. కాని జానకీ, మీరు వద్దన్నా వచ్చినందుకు బాధగా వుంది. నన్ను క్షమిస్తారు కదూ!"

"ఏమిటా మాటలు? నువ్వు సుఖంగా వుండాలని అలా అన్నాను. అంతే." నొచ్చు కుంది జానకి.

"పెండ్లయిన ఆడది పుట్టింట్లో వుండడం లోకం సహించలేదు. వున్నా ఇంట్లో వారే హర్షించరు. అందుకే వేరెక్కడో వుండేకన్నా ఇక్కడే వుంటే బాగుంటుందను కొని వచ్చాను."

"అర్థమయిందమ్మా." ఆప్యాయంగా తల నిమిరింది.

(ఇంకావుంది)

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

# అద్వితీయ విమల్

ఒక్క విమల్ మాత్రమే ప్రతి ఏడాది
60 లక్షల మీటర్లకు పైగా సూటింగ్స్‌ను
మీకు అందచేస్తుంది.
100% పాలియెస్టర్, పాలియెస్టర్/ఊలు,
ఇంకా వివిధ రకాల బ్లెండ్స్‌లో.

## ట్రీవాల్

విమల్ వారి పాలియెస్టర్/ఊలు సూటింగ్.
ఈ సీజన్ కై,
200 కు పైగా సరిక్రొత్త డిజైన్,
రంగుల కలయికలలో. అన్నీ అద్వితీయమైనవే.




సూటింగ్స్





భారత దేశంలో అత్యంత ఆధునికమైన టెక్స్‌టైలు
మిల్లువారి ఉత్పాదన

VIMAL/S/4/79 TEL





# సరదాల పండుగ - దసరా

సంవత్సరంలో ఎన్నో పండుగలూ పర్వాలూ వస్తాయి కానీ, వాటిలో ముఖ్యమైన పండుగలు ఉగాది, దసరా, దీపావళి, పెద్ద పండుగ మాత్రమే కానవస్తాయి.



పులివేషాల జోరు

## బొమ్మల పండుగ

ఇందులో మొదటి ఆకర్షణ బొమ్మల కొలువు. ఈ పండుక్కి చాలా రోజుల పడతారు తమ కొలువును చూసి, తామే మురిసిపోతారు.

ఏ పండుగుకీ ఇన్నిదినాలు సెలవులుండవు దసరా పండక్కి మాత్రం. పది రోజులూ సెలవే! రోజుకు ఒకరకం భక్ష్యాలు చేసి, బొమ్మలకు నైవేద్యం పెట్టి, సాయంకాలం పేరంటానికి వచ్చిన వారికి పేరంటాలుగా పంచి పెడతారు రంగు రంగుల దుస్తులతో ఆడపిల్లలు చిలకల్లా తయారై పరిచితులను కొలువును చూడడానికీ, పేరంటానికీ పిలుస్తారు ప్రతిరోజూ ఎంతో సరదాగా జరిగిపోతుంది.

## మంత్ర శాస్త్రం

మంత్ర శాస్త్రవేత్తలూ, దేవీ ఉపాసకులూ ఎంతో నియమంతో దేవీ పూజలు జరుపుతారు. పగలల్లా ఉపవాసముంటారు. రాత్రి మాత్రం ఏకభుక్తం చేస్తారు.

దేవీ పూజ జరిగినట్లే దసరాలో సరస్వతీ పూజ జరగడం, రాత్రి కాలక్షేపాలూ, పాటకచేరీలు జరగడం తెలుగు దేశంలో చాలచోట్ల పరిపాటి. నాటక ప్రదర్శనాలు జరగడం కద్దు. చక్కగా అలంకరించిన గుమ్మటాలపై ఉంచిన సరస్వతీదేవి విగ్రహం కన్నుల పండువుగ కానవస్తుంది.

తయారుచేసి, రకరకాల మిఠాయిలు అరగింపు పెట్టి, పంచిపెడతారు. దీనికోసం ప్రత్యేకంగా సెలవు తీస్తారు. ఆ ప్రాంతాలలో చెప్పుకోదగిన పండుగ ఇది ఒక్కటే!

## 9 రాత్రులు

ఈ దసరా దినాలలోని తొమ్మిదవ రోజు మహర్నవమి. కార్మికులకు ముఖ్యమైన పండుగ మరే పండుగా వారికి ముఖ్యం కాదు. తమ తమ జీవనానికి ఆధారమైన పనిముట్లను వారు ఆనాడు అలంకరించి పూజిస్తారు. అందువల్లనే దానికి "ఆయుధ పూజ" అనే పేరు వచ్చింది. ఆయుధాలకే కాక— వివిధ వాహనాలకూ, సైకిళ్ళకూ, కుట్టు యంత్రాలకూ కూడ ఆనాడు పూజ జరుపబడుతుంది. ఆ రోజు ఉల్లాసంగా గడుస్తుంది.

కార్మికులకే కాదు— కర్షకులకు కూడ ఇది ముఖ్యమైన పండుగే! మనకు అతి ప్రధానమైన పరిచేలు పొట్టలతో కలకలలాడుతూ కన్నులకు కనబడేసరికి— కర్షకులకు— తమ పొలంలోని పంటసాయం ఎంత ఉంటుందో అంచనాకి వచ్చి ఆనందం కలుగుతుంది.

ఎండలు, వానలు, చలి— ఈ మూడూ బాధించని ప్రశాంత— అనుకూల సమయం

విటిలో ఉగాది ఒక్కరోజు పండుగ. దీపావళి రెండు రోజుల పండుగ. పెద్ద పండుగ మూడు రోజుల పండుగ కాని దసరా మాత్రం పది రోజుల పండుగ దసరా అనే పేరు లోనే ఉంది ఆ అర్థం. దశరాత్రులే దసరా.

పండుగ అంటేనే అందరికీ సరదా. ముఖ్యంగా పిల్లలకు సరదా. పండుగకు కొంత ముందుగానే దానికోసం ఆరాటం, ప్రయత్నాలూ జరుగుతాయి పిల్లల పేరు చెప్పుకుని పెద్దలూ సరదాపడి వాళ్ళకి ఆయా ఏర్పాట్లలో సహాయ పడతారు.

ఉగాదినాడు తలంటి పోసుకుని, కొత్త దుస్తులు ధరించి ఉగాది పచ్చడి, పిండి వంటలు తినడంతోనే పిల్లలకు సరదా తీరి పోతుంది. పెద్దలకు సాయంకాలం పంచాంగ శ్రవణంతో తీరిపోతుంది దీపావళికి– మొదటి రోజు పిల్లల సరదా మతాబాలతోనూ, రెండవరోజు మిగిలిన మతాబాలతోనూ వేడుక ముగుస్తుంది. పెద్దలకు అమావాస్యనాడు దీపాల వరుసను వెలిగించడంతోనూ తృప్తి కలుగుతుంది. పెద్ద పండుగ రోజుల్లో మొదటి రోజే పిల్లలకూ పెద్దలకూ వేడుక. రెండవ రోజు పెద్దలకూ, మూడవరోజు పశువులకూ ముఖ్యం. అన్ని రోజులూ అందరికీ ముఖ్యంగా ఉండేది మాత్రం దసరా పండుగే కానవస్తుంది. ఈ పండుగ పిల్లల సరదాతో ప్రారంభమవుతుంది.



ముందు నుంచి పిల్లలు బొమ్మల సేకరణ చేస్తూ వుంటారు. కొత్తవాటిని కొనడం, పాతవాటిని బయటికి తీసి శుభ్రంచెయ్యడం జరుగుతుంది. దసరాకు ముందు అమావాస్య సాయంత్రానికి కొలువు తయారవు తుంది అల్లాడు నిర్మించే ఈ కొలువుకి పిల్లలు ఎంతో ఉత్సాహంతో సహాయ

మిగిలిన పండుగలు మన దక్షిణప్రాంతం లోనే ప్రసిద్ధంగ ఉన్నాయి. దేవీ నవ రాత్రులు పశ్చిమ బెంగల్. బీహార్ ఒరిస్సాల లోనూ ప్రధానాలు! దుర్గాపూజ అనేపేరుతో దేవీపూజ మహా వైభవంగ- ఒక్కొక్క నగరంలోనే పెక్కుచోట్ల మహా వైభవంగ జరుగుతుంది. ఆకాశంకొద్ది ధనం వ్యయంచేసి దుర్గా విగ్రహాలనూ, మంటపాలనూ

## బొమ్మల కొలువుల మోజు

దసరాతో ప్రారంభం అయ్యేకొంచెమే యీ పండుగ ముగించుకొనే ప్రాచీన కాలంలో రాజులు జైత్ర యాత్రకు బయలుదేరే వారు.

"అంగీరస"

ఫొటోలు : బోనేపల్లి మురళి. శ్రీశైలం కుడ్య శిల్పాలు : ఎం. శివశంకరయ్య



సీరియల్

# నళిని

చిట్టారెడ్డి సూర్యకుమారి

(గత సంచిక తరువాయి)

ఆ గదిలో తెర మాత్రం అడ్డున్న బల్లపై పడుకోమంది నళినిని ఎంత విన్నగ మాట్లాడినా యివతల వున్నవారికి వినిపిస్తుంది. డాక్టరమ్మ కడుపు పరీక్షించింది ఆరు నెలల గర్భిణి నళిని వైపు చూసింది కళ్లు మూసుకొని అచేతనంగా వుంది

"మారేజ్ అయి ఎన్ని మాసాలైంది ?"

"మూడున్నర నెలలు..."

"గట్టివారే " గొంతు నిండుగ నవ్వింది లోపలనుంచే "మిస్టర్ మోహన్! కంగ్రాచ్యులేషన్స్" అంది "డాక్టర్!" అన్నాడు మోహన్ వుత్సాహాన్ని అణచుకుంటూ

"మీరు మొదటి రోజునే బేబిని చేశారు మీ పెళ్లాంత వయస్సు వుంది.." గుండెల నిండుగా గాలి ఒక్కసారి పీల్చుకున్నారు, నళినీ వాసవీ, వాసవి కృతజ్ఞత తన కన్నీటితో తెలిపింది నళిని ఎంతకీ బయటికి రాకుంటే మోహన్ లేచివెళ్లాడు ఇంకా బల్లమీద వున్న నళినిని లేవనెత్తుతూ, కడుపుమీద ముద్దు పెట్టుకున్నాడు అంత మంచివాణ్ణి మోసం చేస్తున్నందుకు సిగ్గుపడిపోయి ముఖం దాచుకుంది

"మై వైఫ్, థాంక్యూ!" అన్నాడు

"కాస్త ఎనిమిక్‌గా వుంది" అంటూ డాక్టరమ్మ టానిక్కులు వ్రాసి ప్రతి పక్షం రోజులకి వచ్చి పరీక్ష చేయించుకోమని చెప్పి కాన్పు తన చేతులమీదనే చేయించుకోవాలని కోరింది

మోహన్ 'అలాగే' అన్నాడు

ఆ డాక్టర్ తనని, తన మానాన్ని, తన బిడ్డని కాపాడినందుకు హృదయాంజలులు అర్పించింది నళిని

నళినికి ప్రసవవేదన తీవ్రమైంది ఆపరేషన్ చేయవలసి వచ్చింది నళిని ప్రసవవేదన చూసి భయకంపితుడై యిక పిల్లలు మాకు వద్దు స్టెరిలైజేషన్ చేయమన్నాడు మోహన్. పిచ్చిగ కేకలు పెట్టుతున్న నళిని స్తంభించినట్లు నిముషం వుండిపోయి, వెంటనే తేరుకొని, "వద్దు, వద్దు డాక్టర్ నాకు పిల్లలు కావాలి ఇంకా కావాలి" అంటూ ఏడ్చింది

నళిని బాధ డాక్టరమ్మ అర్థం చేసుకొంది ఈ బిడ్డ మోహన్‌ది కాదు అందుకే మోహన్‌కి తన బిడ్డనే మళ్ళీ యివ్వాలని వుంది

నళినిలో తల్లినే ఎక్కువగా చూస్తున్నాడు



స్త్రీకి భర్తకంటే, తనలోనుంచి వచ్చిన పిల్లలంటే మక్కువ ఎక్కువ' అనుకుంటూ తృప్తిగా నవ్వుకున్నాడు మోహన్

*　　*　　*

దశరథుడు రాముణ్ణి ఎంతగ ప్రేమించాడో అంతకు రెట్టింపు రాముడు దశరథునికి యిచ్చాడు. ఆ అనుబంధం మళ్లీ యిక్కడ కనిపిస్తుంది అని వాసవి ఈ తండ్రి కొడుకులను చూసి అనుకొంది.

అజయ్ కొడుకు పూర్తి తండ్రి ప్రేమను రాగాలేగాక తండ్రి సమయాన్ని కూడా తీసుకుంటున్నాడు. నళినికి కాన్పుతో ఆరోగ్యం దెబ్బతీసింది బాబు పాలనా పోషణ మోహన్ తీసుకున్నాడు నళినికి సంతోషించాలో, ఏడ్వాలో తెలియకుంది మోహన్ కన్నుల్లో మెరుపులు, ఆ తండ్రి గర్వం చూసినప్పుడల్లా, "మోహన్! ఆ బిడ్డ నీ కొడుకు కాదు నేను అబద్ధం! అబద్ధం?" అని బిగ్గరగా అరిచి చెప్పాలనిపిస్తుంది

ప్రేమగల తండ్రిని మోసం చేస్తున్నానే అన్న బాధ గుండెను కోస్తుంటే, శారీరకంగా ఏ జబ్బు లేకపోయినా, మానసికంగా కోలుకోలేక పోయింది

"నళినీ! గండం గడిచింది బాబుకి తండ్రి దొరికాడు మోహన్ నీడలో చల్లగా పెరిగి పెద్దవాడవుతాడు. నీవు బాగుండాలి సంతోషం తెచ్చుకొని మమ్మల్ని సంతోషపెట్టు" అని చెప్పింది వాసవి

"బావని నిముష నిముషానికి మోసం చేస్తూ

**జరిగిన కథ-12.** తమ కాలేజీ చదువు ముగించుకొని బయటపడ్డారు వాసవి, నళినీలు తరువాత వాసవితో కలిసి వాళ్లవూరు వెళ్తుంది నళిని అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది కొన్నాళ్ళకు ఆ వాతావరణం విసుగుపుట్టగా, బావ మోహన్‌తో కలిసి వాసవి, నళినీలు లేపాక్షి వెళ్లి అక్కడి సుందరమైన శిల్పములను, వాటి చరిత్రను తెలుసుకొంటారు అక్కడినుండి హైద్రాబాద్‌లోని తనవాళ్ళ దగ్గరకు వెళ్తుండగా, రైల్వేస్టేషన్‌లో పరిచయమైన కెప్టెన్ అజయ్, తనని ప్రేమిస్తున్నానని చెప్పగా ఆశ్చర్యపోతుంది నళిని తన తండ్రి మరణించగా, నళిని యిచ్చిన టెలిగ్రామ్‌ను అందుకొని అక్కడకు చేరుతుంది వాసవి అజయ్ తన తల్లిదండ్రులకు వాసవి, నళినీలను పరిచయం చేస్తాడు వాళ్ళ దగ్గర శలవు తీసుకొని అక్కగారి పిల్లలతో కలసి హకీమ్‌పేట్ ఏర్‌ఫోర్స్ స్టేషన్‌కి వెళ్ళి, అక్కడివన్నీ చూసి, అక్క రాజకుమారి, బావ రావుగార్లతో మెస్‌లో పార్టీకి వెళ్తారు వాసవి, నళినీలు కొన్నాళ్లకు వాళ్ళు యూనివర్సిటీలో చేరగా, అజయ్ వచ్చి నళినీని తీసుకుపోతాడు అనుకోకుండా 'జూలాజికల్ రెస్ట్‌హౌస్'లో అజయ్, నళినీలు ఏకశరీరులైపోతారు భారత్, పాకిస్తాన్‌ల మధ్య జరుగుతున్న యుద్ధంలో అజయ్, రావులు పాల్గొంటారు అజయ్ మరణించిన కొంత కాలానికి, నళిని గర్భవతి అవుతుంది మోహన్, నళినీని ప్రేమిస్తున్నాడని తెలిసి వాసవి బాధపడుతుంది నళిని అంగీకారంతో ఆమెను పెండ్లాడుతాడు మోహన్ నళినీకి కొడుకు పుడతాడు

నేను బ్రతకలేకున్నాను ధూళిలో కలిసిపోవలసిందే!"

"నళినీ! విష్ణుపాదంలో వున్న గంగ శివుని శిరస్సున చేరింది" అని పలువిధాల చెప్తుంటే అప్పటికప్పుడు తేరుకొనేది బాబుకి ఎనిమిదోనెల అయితే నళిని మూడోనెల గర్భిణి

"ఇంత తొందరపడితే ఎలాగ? కనీసం రెండు సంవత్సరాలైనా తేడా లేకపోతే నీ ఆరోగ్యం దెబ్బతింటుంది" అని డాక్టరు మందలించింది

"మీకు తెలియనిదేముంది డాక్టర్ బావ చేతుల్లో తన రక్తం పంచుకొని పుట్టిన బిడ్డని చూస్తేగాని నా హృదయంలో మండే అగ్నిజ్వాల చల్లారదు" అంది నళిని

నెలలు నిండి ముమ్మూర్తులా మోహన్‌లా పుట్టిన పాపాయిని చూసి వాసవి హృదయం పొంగిపోగా, "బావ పాప!" అని తలస్తూ హృదయానికి హత్తుకుంది బావ బిడ్డను తను కనినంతగా సంతోషిస్తుంటే నళిని గుండె క్రొత్త సమస్యతో బరువెక్కింది

బావ పాపాయిని ఇద్దరూ తల్లులై పెంచారు కంటికి ప్రియంగావున్న ఆ పాపాయికి 'ప్రియదర్శిని'

ఆ పేరు పెట్టింది వాసవి. ఇందిరాగాంధి పుట్టినప్పుడు కవయిత్రి సరోజినినాయుడు నెహ్రూగారికి వ్రాసింది, ''లవ్ టు ఆల్ యండ్ కిస్ టు ది న్యూ సోల్ ఆఫ్ ఇండియా'' అని వ్రాసిందట. పిల్లల పేర్లు పెట్టే బాధ్యతే కాకుండా ఆ యింటి పెత్తనం, బరువు బాధ్యతలు వాసవి మీద పడ్డాయి.

*　　　*　　　*

వాసవి పోస్టుగ్రాడ్యుయేటు డిగ్రీ తీసుకొంది. ఆ వూర్లోనే కాలేజిలో లెక్చరర్‌గా చేరింది.

నళిని మరో జన్మ ఎత్తినట్లు కన్నబిడ్డలతో, దేవుడులాంటి భర్తతో సంసారంలో పడుతుందని ఆశించింది వాసవి.

నీరసంగా దేనిమీద ఆశ లేనట్లు ఎప్పుడూ పడకని ఆశ్రయించుకున్న నళినిని చూసి మోహన్ మనస్సు చివుక్కుమనేది.

స్వతహాగా ఉత్సాహవంతుడు. జీవితంపట్ల ఆసక్తిగల మోహన్‌కి జీవితంలో అనుకోని లోపం ఎంతోగా వుంది భార్యపై ప్రేమగల అతను మనస్సు సరిపుచ్చుకోటానికి ప్రయత్నించేవాడు. ఇంట్లో విషయాలు ఏం చెయ్యాలన్నా, ఏమి కావాలన్నా నళినితో సంప్రదించను వెళ్ళితే, నళిని వాసవిని అడిగేది. ఎంత నిగ్రహించుకుందామన్నా మోహన్‌లో కోపం తొంగిచూసేది

''నళినీ! నీవెందుకు అలావుంటావు? ఏం చేస్తే నీవు మామూలు మనిషివవుతావు?'' అని వాసవి లాలనగా అడిగింది

# నళిని

''వాసవీ! ఇంకా నీదగ్గర ఏముంది? నీ భర్తను, నీ సంసారాన్ని, నీ జీవితాన్నే నాకిచ్చావు. అదే నన్ను తినేస్తుంది. ప్రతిఫలంగా నీకేమి యిచ్చాను. నీ జీవితం మోడయింది...''

''నళినీ! ప్రపంచంలో అతిమధురమైంది స్నేహం. అది ఎందరికి లభిస్తుంది. ఆ రుచి ఎందరికి తెలుస్తుంది? అది చిన్నప్పటి నుంచి ఇప్పటివరకు అనుభవిస్తున్నాను. పరోక్షంగా నీ సంసారం నేను అనుభవిస్తున్నాను. ఇంతకంటే మరేం కోరను?

నీకు సంతోషం కలిగించేది, నిన్ను మామూలు మనిషిని చేసేది నా పెళ్లి అయితే చెప్పు. రేపే చేసుకుంటాను 'మాధవ్'ని (ఇంగ్లీష్ లెక్చరర్) నా సంగతి తెలుసు, అదే బావ నన్ను కాదని నా స్నేహితురాలిని చేసుకున్నాడని. నన్ను ప్రేమిస్తున్నాడు. పెళ్లి చేసుకుంటానని ఎన్నివిధాల చెప్పాలో అన్నివిధాలుగా తెలియపర్చాడు...'' తనవంకే చూస్తున్న నళిని వైపు ఎవ్వుతూ చూసింది. నళిని కూడా నవ్వింది. మాధవ్ అందుకేనా అన్నిసార్లు వస్తుంది. నా వాసవి కోసమా? ఈసారి వస్తే చెప్తాను, ఆశలు పెట్టుకోవద్దని.

''వాసవీ! నీకు తెలియదు. మనస్సులేని మనువు ఎలా వుంటుందో. అది నరకం. ప్రతి క్షణం అగ్నిలో వున్నట్లుంది వాసవీ! ఈ యిల్లు, బావ, పిల్లలు ఎప్పటికి నీవారే. నేను ఇక ఎక్కువకాలం జీవించలేననిపిస్తుంది. గుండె ఎప్పుడు భారంగా, బరువుగా అశాంతితో వుంటుంది. దేవుని మందిరావరణంలోనే నాకు శాంతి లభిస్తుంది. విముక్తి ఎప్పుడో? ...'' మాట్లాడుతున్న నళిని గుండెమీద చెయ్యి వేసుకొని ఒరిగిపోయింది.

''బావా!'' అంటూ భయంగా పిలిచింది వాసవి.

*　　　*　　　*

నళిని వివాహ జీవితానికి వయస్సు మూడేళ్ళు.

పొడగాటి రెప్పల్లో చిన్న కళ్లు చురుగ్గా తనవైపే చూస్తుంటే ఆ కళ్లని, లేత పువ్వులాంటి ముక్కును, నోటి కందని ఆ చిన్న మూతిని పదే పదే ముద్దుపెట్టుకుంటూ...

''ప్రియా! నీకెవ్వరు యిష్టం!'' అంటూ ప్రియదర్శినికి డ్రెస్ చేస్తూంది నళిని.

అమ్మ పని అమ్మ చేస్తూవుంటే బొమ్మతో ఆడుకుంటూ ప్రియ ఒకసారి అటు యిటు చూసి దగ్గర్లో డాడీ లేడని ''అమ్మ ఇచ్చం'' అంది.

మెడదాకా వున్న జుట్టు చివర్లో వంకీలు తిరిగాయి. ఫ్రింజ్ నుదుటిని కప్పేసింది. పింక్ కలర్ ఫ్రాకులో పాప రంగు కలిసిపోయింది. పాప కళ్లు తిప్పిన తీరు చూసి నళినికి నవ్వు వచ్చింది. 'ప్రియా' అని కూతుర్ని హృదయానికి చేర్చుకుంది. అప్పుడే తండ్రికొడుకులు లోనికి వచ్చారు.

''రెడీయా'' అన్నాడు మోహన్.

తెల్లగా బొద్దుగా పెద్ద పెద్ద కళ్లతో బాబు మోహన్ చెయ్యి పట్టుకొని అమ్మవైపు చూస్తున్నాడు

"వాసవి రాలేదు"

"వాళ్లకేదో ఫంక్షన్ వుందనుకుంటాను వచ్చేటప్పటికి ఆలస్యం కావచ్చు మనం వెళ్దాం!"

వారి మారేజ్ దినం పండుగ చేసుకోవాలనుకున్నాడు మోహన్ తన స్నేహితులకి డిన్నర్ ఇస్తానన్నాడు

ఇన్నిదినాలు నళిని ఆరోగ్యం సరిగ్గాలేక పిల్లలు చిన్నవాళ్ళ వారితోనే సరిపోయేది ఏది చేసుకోటానికి వీలులేకుండా వుండేది

చుట్టూవున్న మనుష్యులు వూరుకోలేదు మోహన్ ఇద్దరితో కాపురం చేస్తున్నాడని చాటుగ మాటుగ చెప్పుకునేవారు పిల్లల్ని తీసుకొని వాసవితో బయటికి వెళ్తే కట్టుకున్న భార్య రోగిష్టిది ఇంట్లోనే వుంటుంది లెక్చరర్ భార్యతో షికార్లు అని చెప్పుకోవటం, స్నేహితుల పరిహాసాలు మోహన్‌కి తెలియకపోలేదు ఆ ఇద్దర్నీ స్నేహితులు భార్య కిష్టమైంది అదృష్టవంతుడు అని కొందరు ఈర్ష్యపడ్డారు, వర్నమెంటుకి ఆకాశరామన్న ఉత్తరాలు పంపించసాగారు కొందరు వాసవినే మోహన్ భార్య అనుకొన్నారు నళినిని చూసినవారు బహు కొద్దిమంది.

ఈ అపవాదు నుంచి ఎలా బయటపడాలా అని ఆలోచించి బదలీ చేయించుకున్నాడు ట్రాన్స్‌ఫర్ అయిన మూడునెలలకి ప్రవేటు కాలేజీలో ఇక్కడా ఉద్యోగం దొరికింది వాసవికి

నళిని ఆరోగ్యం ఒకదారి కొచ్చింది ఇకనైనా కొత్తజీవితం ప్రారంభిద్దామని ఆశిస్తూ నళినిని బయటికి తీసుకెళ్ళానికి ప్రయత్నించేవాడు వెంట వాసవి లేకుండా వచ్చేదికాదు ఏ చీర కొన్నా వాసవికి యిష్టమైనవే ఆమె మెచ్చిన రంగు ఆమె ఎన్నికకే తనకు సరిపోయినవని సరిపెట్టుకునేది ప్రతిదానిలో వాసవికి భాగం

"అన్నీ వాసవికి ఇస్తావ్, రేపు నీ భర్తను కూడా ఇచ్చేలావున్నావు" అని అమ్మ పార్వతమ్మ అంది పరిహాసంగా

'దాని జీవితాన్ని నాకు యిచ్చింది తిరిగి దాని జీవితాన్ని ఇచ్చినరోజున నేను నిజంగా జీవిస్తాను' అని మనస్సులో అనుకొని పైకి, పేలవంగా నవ్వి వూరుకుంది

"మనిద్దరి పండుగ వాసవి రాకపోయినా ఫర్వాలేదు మరోసారి వెళ్దాము" అని మోహన్ అన్నాడు మోహన్ కొత్తగా మాట్లాడుతున్నాడని అనుకొంది

ఆ పని ఈ పని చేస్తున్నట్లు మరో అర్ధగంట గడిపింది బాబు వెళ్దాం అని గొడవ చేస్తున్నాడు

"నాన్నా" అన్నాడు

"ఏరా నాన్నా" అని పలుకుతాడు మోహన్

"అమ్మ రాకపోతే మనం పోదాం! షాపులు మూసేస్తారు" అని అంటున్నాడు

"పోదాం! పోదాం" అని తలూపుతున్నాడు

నళిని, వాసవిల స్నేహం తనకి తెలుసు అని ఆలోచనలో పడ్డాడు స్త్రీ ఏదైనా ఇస్తుంది కాని తన భర్తను మాత్రం ఇవ్వదు వాసవి అంటే ప్రేమ కృతజ్ఞత వుండవచ్చు తనకు వాసవికి మధ్య ప్రపంచం వూహించేది ఏది లేదని తెలుసు వాసవి తెలిసి తెలిసి తనకి ద్రోహం చేయదని తెలిసే అంత ధీమాగా వుందనుకున్నాడు నళినిలో వేడి, ఈర్ష్య, కలిగించాలనుకున్నాడు

తను కోరుకుంది ఇలాటి జీవితాన్నా? మంచుముద్దలాటి భాగస్వామినా? జీవితంపట్ల ఎన్నో కలలుగన్నాడు నళినితో జీవితం యిలా చప్పగా వుంటుందనుకోలేదు ప్రేమించిన నళినితో బ్రతుకులోని సుఖాన్ని జుర్రుకోవాలనుకున్నాడు ఆలోచనలో వుండి బాబు చెప్పతున్నదేదో వినడంలేదు

"నాన్నా" అని చెయ్యిపట్టి లాగాడు

"ఏరా నాన్నా!"

మమ్మీ వచ్చిందన్నాడు పిల్లలు వాసవిని మమ్మీ అంటారు

* * *

మోహన్‌లోని మార్పు నళిని గుర్తించకపోయినా, వాసవి మొదటి చూపులోనే గుర్తించింది గుండె లయ తప్పింది ఆ వెంటనే మనస్సును నిలదొక్కుకుంది ఆదినుంచి మగవాని మాయాజాలంలో స్త్రీ పడుతూనేవుంది అకస్మాత్తుగా బావలో ఈ ప్రత్యేకాభిమానం,

## తొక్క వొలిచిన ఉల్లాసం




నారింజ రుచిగల
**బ్రిటానియా డిలైట్** కరకరల కమ్మదనం నింపుకొన్న బిస్కట్

BRITANNIA

లింటాస్-BBC.DLT.6-2720 TL

# న ళి ని

అలిసినువుకి కారణం? నళిని పాతబడిందా? భార్య ఎక్కడికిపోదు. కొత్తరుచి కావలసివచ్చిందా? ఇది ఎంతవరకు పోతుందా? అని తలచింది

ఆ రాత్రి పాప ప్రక్కలో పడుకున్న నళిని ఇంకా గాఢనిద్రలో లేదు అలికిడికి మెలుకువ రావచ్చు, కదులుతూనేవుంది మోహన్ లేచాడు మెల్లిగా ఆ గది నుంచి బయటికి వచ్చాడు కాసేపు సన్నజాజి పందిరి క్రింద గార్డెన్ కుర్చీలో కూర్చున్నాడు తిరిగి వస్తూ వాసవి గదిలోకి వచ్చాడు వెన్నెల ఆ గదిలో పడుతూంది నిద్రపోతున్న వాసవిని చూస్తూ నిలుచున్నాడు

మగతనిద్రలో వున్న వాసవికి తన గదిలో ఎవ్వరో వున్నారనిపించింది కళ్ళు విప్పి పురుషాకారాన్ని చూసి వూపిరి బిగపట్టింది వాసవి కదలగానే మోహన్ బయటికి వచ్చేశాడు

బావ! బావ! తన గదిలోకి వచ్చాడు! ఎందుకు? వాసవికి నిద్ర దూరమైంది

మోహన్ ఆఫీసుకు వెళ్ళాడు బాబు నర్సరీ స్కూలుకి వెళ్ళాడు ప్రియ నిద్రపోతూంది నళిని పాప చొక్కాకి కుందేలు బొమ్మని కుట్టుతూ వుంది వేళకాని వేళ వాసవి ఇంటికి వచ్చేసింది

"క్లాసులు లేవా!" నళిని యధాలాపంగా అడిగింది

నళిని అతిశ్రద్ధగా చేస్తున్న పని చూసి, "నళినీ! ప్రియ అంటే నీకెందుకు అంత ప్రేమ?!"

"బావ కూతురని"

"అంటే?"

"బావకి నేను ద్రోహం చేశాను తనువు నిచ్చాను కాని మనస్సును ఇవ్వలేకపోతున్నా బావ కివ్వలేనిది ప్రియ కిస్తున్నాను అలాగైనా శాంతి దొరుకుతుందని ఆశ!"

"నళినీ బావలో మార్పును గుర్తించావా?"

"...."

"నళినీ.. బావ, రాత్రి నా గదిలోకి వచ్చాడు ఎందుకో? అలా ఎప్పటినుండి నిలుచున్నాడో! నేను కదలగానే వెళ్ళిపోయాడు"

"....."

"నళినీ నీకేమనిపించటంలేదా? బావ చిన్ననాటి చెలికి దూరమైపోయాడు వాగ్దానాన్ని మరచాడు. ఆ తప్పును క్షమించవచ్చు మనస్సులు ఎదుగుతాయి మార్పుచెందటం సహజమని సమర్థించుకోవచ్చు కాని కాని భార్యను మోసం చేసే భర్తను క్షమించలేము నా బావ ఆ తప్పు చేస్తే సహించలేను నళినీ! కాలేజీలో నా కాలు నిలువలేదు నీకు అన్యాయం జరగకూడదు" చేతిలోని ఫ్రాకు క్రింద వుంచి వాసవి నిశ్శబ్దంగా కార్చే కన్నీరు తుడిచింది

"వాసవీ! బావలో ఆ మార్పు కలుగుతుంటే నాకు పరమానందంగా వుంది నీ బావని నీకిచ్చే శుభదినం కొరకు ఎదురుచూస్తున్నాను వాసవీ! తనువులతో ఆత్మలుకూడా పెనవేసుకుపోయినప్పుడే వారు నిజమైన భార్యాభర్తలు భర్తకు సంపూర్ణంగా కామకలాపాల్లో తృప్తినిచ్చి ఆనంద పరచినప్పుడే పురుషునికి తగిన భార్య అనిపించు కుంటుంది నీవు నా విషయంలో బాధపడటం మానేయ్ అన్నీ కాలానికి వదిలేద్దాం" అని వాసవికి ధైర్యం చెప్పింది

నళిని మనస్సులో "వాసవీ! నా ప్రాణమా! మనము అనుకున్నది నిర్విఘ్నంగా జరిగిపోయింది అజయ్ కొడుక్కి తండ్రి అనురాగాలు దొరికాయి తండ్రే కాదు, తల్లీ వుంది నీ నీడలో నా పిల్లలు విశ్రమిస్తారు పెరుగుతారు పెద్దవుతారు వాసవీ – నన్ను అర్థం చేసుకో ఈ గుండె బరువు నేను మోయలేను నాకు శాంతి కావాలి! గుండెల్లో అగ్నిపర్వతాలు ఎన్నాళ్ళు దాచుకోను! నాకు విముక్తి కావాలి, ముక్తి కావాలి" అని ఆక్రోశించింది

[ఇంకా వుంది]

త్వరలో
ప్రాక్టీసు
పెట్టిచూడు...
సీరియల్

## ఎందుకంటే......

1. మీరు పొదుపు చేయవలసింది అతి తక్కువ.
2. మీరు పొదుపు చేసిన మొత్తానికి బ్యాంకు హామీ వుంది. (జాతీయ బ్యాంకు రొఖపు పత్రాల ద్వారా)
3. మీరు ఎన్ని బహుమతులు అయినా పథకం అనంతరం వరకూ గెలుపొందవచ్చు.
4. మీరు పొదుపు చేసుకొనే మొత్తంలో ఏ సర్వీసు చార్జీలు, మినహాయింపులు లేవు.
5. బహుమతులు రానియెడల మీ పొదుపు సొమ్ము రూ.150/- తోబాటు మరో రూ.40 చేర్చి మొత్తం ఇవ్వబడుతుంది.
6. బహుమతులు వచ్చినా, రాకపోయినా మీ పొదుపు సొమ్ము బ్యాంకు ద్వారా భద్రతతో మీరు తిరిగి పొందుతారు.
7. మీ బహుమతులు పథకం అనంతరం వరకూ నెల నెలా జరుగు రెగ్యులర్ డ్రాలే గాక మీ బహుమతులు రూ.**1,50,000/50,000/25,000** గాక మరి 34 వేలకి పైగా బహుమతులలో రూ. **8 లక్షల 6 వేలు.**
8. ఏ కారణం చేతనయినా తన సభ్యత్వాన్ని మధ్యలో నిలిపివేసినప్పటికీ ఏ విధమైన నష్టము లేదు. అప్పటివరకూ పొదుపు చేసిన మొత్తం ఇచ్చివేయబడుతుంది.

ఇంతకుముందు పూర్తయిన మా మొదటి మహిళా గ్రూప్ పథకంలో సభ్యత్వము లభించక వేలాదిమంది నిరుత్సాహపడ్డారు. అందుకే, ఆలస్యం చేయవద్దు. ఈ క్రింద నివ్వబడిన మా శాఖలలో మీరు సభ్యురాలిగా... లేక మా ప్రతినిధిగా చేరవచ్చు. లేదా మీ మొదటి నెల వాయిదా రూ.25/- లేక మొత్తం రూ.150/- M.O/బ్యాంక్ డ్రాఫ్ట్ లేక P.O. ల ద్వారా పంపండి.

ోన్ 62248 ● పొదర్తి బిల్డింగ్స్, మెయిన్ రోడ్,
నరసింహులు క్లాత్ షాప్ ఎదురుగా, సుల్తాన్ బజార్,
డ్, కర్నూలు ● ఎల్లమ్మగుట్ట, నిజామాబాద్,
● స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ రోడ్, మహబూబ్‌నగర్
వద్ద, నిర్మల్ ● బోస్ రోడ్, కామారెడ్డి
, మునిరావు స్ట్రీట్, కడప ● 14/77/A- D.C.M.S రోడ్,
c - శేషాపిరాన్ వీధి, చిత్తూరు ● మెయిన్ రోడ్,
● మునిసిపల్ ఆఫీసు రోడ్, రేపల్లె (గుంటూరు జిల్లా
లు ● కె వి.చలపతిరావు, మెయిన్ రోడ్, కొత్తగూడెం
కొడూరు (నెల్లూరు జిల్లా) ● నుగ్గునాగిసెట్టి, మార్కెట్ వీధి,
కో, పవర్ పేట, ఏలూరు ● బ్రహ్మరావు బిల్డింగ్స్,
దురుగా, మచిలీపట్నం ● భైరుమల వీధి, నంద్యాల ●
ముడుపేట ● శ్రీ సేషయ్య, ఆత్మకూరు ● మెయిన్ రోడ్, పోస్టాఫీసు దగ్గర, జగిత్యాల




H.O. రాజమండ్రి-533101.
ఫోన్: 33383.

DIMPLE

# హిమాచల్‌లో 'ద్రౌపదు'లాంటి ఇల్లాండ్రున్న 'తెగ'

లాహౌల్ మరియు స్పిటిల్స్ ఒక జిల్లాగా హిమాచల్ ప్రదేశ్‌లో గుర్తించే ముందు, ఇది పంజాబులోని కంగ్రా జిల్లాలో భాగంగా ఉండేది ఇది 12,210 చదరపు కి. మీ వైశాల్యములో వివిధ తరగతుల తెగలతో టిబెట్‌కు సరిహద్దు ప్రాంతంగా ఉంది మొత్తము 25,538 మంది జనాభాలో 1971 దాదాపు 76 శాతము షెడ్యూల్డు జాతికి చెందినవారు ఈ జిల్లాలో బవుద్ధమతము 61 శాతము మరియు హిందూమతము 38.5 శాతము ముఖ్యమైనవి లాహౌలి వీరి ముఖ్యమైన భాష

కేవలము 25 శాతము లేక 2,770 హెక్టార్ల భూమి మాత్రమే సాగుబడిలో ఉంది 1930 వరకు వీరికి కావలసినంత మాత్రమే పండించెడవారు కాని ఈ సంవత్సరములో కూట్ అనే పంటను పండించి ప్రక్క ప్రాంతములో అమ్మడము జరిగింది దీనివల్ల డబ్బు చెలామణిలోకి రావడము ప్రజల ఆర్థిక, సాంఘిక పరిస్థితులు మెరుగు కావడము జరిగింది గెజిటర్ ప్రకారము ఈ 63 సంవత్సరములలో 1868 నుండి 1931 వరకు జనాభా 8994 నుంచి 11,481 వరకు పెరిగడం జరిగింది అంటే జనాభా పెరుగుదల 28 శాతం మాత్రమే

## బహు భర్తృకత్వం

అన్నదమ్ములందరు ఒకే భార్యను పంచుకోవడము ఇక్కడ అతి సామాన్యము ఇది తక్కువ స్త్రీల వల్ల వచ్చిందని కొందరి శాస్త్రజ్ఞుల అభిప్రాయము కాని జనాభా లెక్కల ప్రకారము పురుషుల కంటే స్త్రీలే ఎక్కువగా ఉన్నారు ఇక్కడ బాల్య వివాహాలు కూడా చాలా తక్కువ గెజిటర్ ప్రకారము ఇది ఒక పురాతనమైన ఆచారము ఈ జనాభా నిరోధకము ఇక్కడి ప్రజల సాంఘిక, ఆర్థిక పరిస్థితులపై చాలా ఆధారపడి ఉన్నది. బహు భర్తృత్వము, ఎక్కువ వయసులో వివాహము చేసుకొనుట, వివాహము చేసుకొన కుండుట మొదలగునవి ఉన్న భూములను అందరు కష్టపడి సమిష్టి కుటుంబాల క్రింద పదిలంగా ఉంచడానికి మాత్రమే

సంప్రదాయానుసారము

ఒక భార్య అన్నదమ్ములందరిని సమిష్టిగా ఉంచడమే కాకుండ స్త్రీకి ప్రత్యేక స్థానము సంపాదించి పెట్టింది గతంలో స్త్రీకు గల అంతస్తు విరివిగా జరిగే వితంతు వివాహాల వల్ల తెలుస్తుంది వరకట్నము లేదు విడాకులు ఇచ్చుకొనుట సులభంగా ఉండేది

1931 నుండి జరిగిన ఆర్థిక పరిస్థితుల మార్పులు ఈ ప్రదేశాలను అనేక ఇతర మార్పులకు గురి చేసింది ఈ మార్పులు ఆర్థిక పరిస్థితుల మెరుగుదల వల్ల ఇంకా ఎక్కువ వేగంగా జరిగడం జరిగింది 1962 చైనా దాడి తరువాత రోడ్డు రవాణా పరిస్థితులు అతి వేగంగా మెరుగుపరచడం జరిగింది ఈ ప్రాంతాలను ప్రత్యేక జిల్లాగా గుర్తించబడినప్పటి నుండి వీటిపై 1960 నుండి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం జరిగింది.



దాదాపు 20 సంవత్సరాల క్రితం బంగాళా దుంపను ప్రవేశపెట్టడం జరిగింది ఇప్పుడు ఈ ప్రాంతం చాలా మంచి క్వాలిటీ గల ఎక్కువ ధర గల బంగాళా దుంపలను ఉత్పత్తి చేయుచున్నది. బయటి ప్రపంచంతో సంబంధాలు, మార్కెట్‌తో సంబంధాలు కూడా చాలా పెరిగాయి. రాకపోకలు, ఉత్తర ప్రత్యుత్తరములు విరివిగా జరగడం వల్ల ఈ ప్రాంతపు ప్రజలు ప్రక్క జిల్లా అయిన కులు ప్రాంతంలో ఆపిల్ తోటలకు మరియు వ్యవసాయమునకు భూములు విరివిగా కొనగల్గుతున్నారు

## ఏకపత్నీ వ్రతం

పై చెప్పిన కారణాల వల్ల కుటుంబ వ్యవస్థలో చాలా మార్పులు వచ్చాయి. కొత్త ఆర్థిక పరిస్థితులలో సమిష్టి కుటుంబాలు కాకుండ స్వతంత్ర కుటుంబాలు ఏర్పాటు చేసుకోడానికి ఉత్సాహం కలిగించినాయి దీనివల్ల బహు భర్తృత్వము నుండి ఏక భార్యత్వమునకు పోవడం వేగంగా జరిగింది. 1961 జనాభా లెక్కల ప్రకారము వివాహమైన మగవారి సంఖ్య 5,110, ఆడవారి సంఖ్య 3,481. అంటే బహు భర్తృత్వము క్షీణించడం జరిగింది.

ఒక సర్వేలో వచ్చిన ఫలితాలలో మాటికి నూరు శాతము ఏక భార్యత్వమే ఎన్నుకోవడం జరిగింది.

## జనాభా పెరుగుదల

ఏక భార్యత్వము వల్ల ఎక్కువమంది భార్యాభర్తలు కావడం దానివల్ల ఎక్కువమంది పిల్లలు పుట్టడం జరిగింది 1951 నుండి 1971 వరకు జనాభా పెరుగుదల దాదాపు 4 శాతము ఇది దేశ జనాభా పెరుగుదల శాతము కంటే దాదాపు రెండింతలు ఎక్కువ అంతేకాక ఎక్కువ మంది నలుగురు పిల్లలు మాత్రమే కావాలని కోరుకోవడం చాలా విచిత్రంగా ఉంది. ఇక్కడ జరిపిన సర్వే ప్రకారము సగటున నల్గురు పిల్లలు కావాలన్నారు

[ బి. పి. దుబే ] *



'ఏడంతస్తుల మేడ'లో, అక్కినేని, సుజాత.

# సినిమా విశేషాలు

**మా ఊరి దేవత - షండప్పే వగువ**

ప్రసాద్ (లక్ష్మీకాంత్) విరామ కుర్చీలో కూర్చొని, ట్రాన్సిస్టర్‌లోంచి హిందీ పాట వింటూ, కూనిరాగం తీస్తున్నాడు. ఇంతలో అతని గదిలోకి ప్రవేశించిన హరిత (ప్రభ) మెల్లగా దగ్గింది.

"ఓ - మీరా? గుడ్‌మార్నింగ్ హరితగారూ! రండి. ఎంతసేపయింది వచ్చి?"

"ఇప్పుడే వచ్చాను నేను కూర్చోడానికి రాలేదు.. మీకు మందివ్వడానికొచ్చాను"

"దానికోసం మీరు శ్రమపడి రావాలా? పాలేరుని నేనే పంపించేవాడ్నిగా?"

"ఫరవాలేదు నాన్నగారు నన్నే వెళ్లమన్నారు"

"వెరీ గుడ్! అయితే, అక్కడ పెట్టండి"

"ఊహూఁ దగ్గరుండి మీచేత మందు తాగించి మరీరమ్మన్నారు"

"వద్దన్నా ఒప్పుకునేలా లేరు కానివ్వండి."

ఆమె గ్లాసులో పోసి కలిపి తీసుకొచ్చిన మందును అతను గటగటా తాగేశాడు. "అరే! ఒక్కగుక్కలో తాగేశారే! చేదుగా లేదా?" విస్మయంతో అడిగిందామె.

"లేదే!"

"లేదా! ... అయితే, పొరపాటున మందు మారిపోయి వుంటుంది"

"లేదు; మందు మారలేదు మీ చెయ్యి తగలగానే దాని రుచి మారిపోయింది"

హరిత అదోలా నవ్వింది.

"ఓ ... మీకు నవ్వడంకూడా తెలుసే?" అన్నాడతను ఆమె నవ్వు ఆపేసరికి "సారీ! ... ఏమండీ, మిమ్మల్నో మాట అడగనా? మీరు ... మీరు .. ఏం చదువుకున్నారు?"

"ఏదో చదువుకున్నాను. కాని, మీ అంత కాదు!" అంటూ హరిత పకపక నవ్వింది.

షాట్ ఓకే అయ్యాక "ఆమె నవ్వులోని అంతరార్థమేమిటో, ఆ మందు మహత్యమేమిటో అతగాడికి తెలియదు పాపం!" అన్నారు డైరెక్టర్ గిరిధర్ నావంక తిరిగి.

ఎం. రామకృష్ణారెడ్డి సమర్పణలో మొలకం సుబ్బరామరెడ్డి ఎం. ప్రభావతమ్మ నిర్మించిన రామకృష్ణా ఫిలిమ్స్ "మా ఊరి దేవత" చిత్రం త్వరలో విడుదలవబోతోంది.

**మరో ఇద్దరు కొత్త దర్శకులు**

సతీష్ ఇంటర్నేషనల్: కె. రాఘవేంద్రరావు బాపు, ఆదిరాజా ఆనందమోహన్, స్వర్గీయ రాముకారియత్ ప్రభృత దిగ్దర్శకుల వద్ద సహకార దర్శకుడుగా అనుభవం గడించిన కల్యాణచక్రవర్తి తొలిసారిగా దర్శకత్వ బాధ్యత వహించే వన్నెల చిత్రానికి ఆగస్టు 3 న తొలి గీతం ధ్వనిముద్రిక చేయబడింది. పెండ్యాల సంగీత దర్శకుడు. "ఊరుమ్మడి బతుకులు, తరం మారింది, కల్పవృక్షాలు, ఇంటింటి రామాయణం" వగైరా చిత్రాలకు గీతాలు రాసిన కోపల్లె శివరాం ఈ చిత్రానికి గీతాలతోపాటు సంభాషణలు కూడా రాస్తున్నారు అరకులోయలో అక్టోబర్‌లో షూటింగ్ ప్రారంభమై, రెండు షెడ్యూల్స్‌తోనే పూర్తవుతుంది.

మాధవి చిత్ర. "ముద్దు - ముచ్చట" అనంతరం నటుడు గిరిబాబు సమర్పణలో శ్రీమతి శ్రీదేవి రెండు చిత్రాలను నిర్మిస్తారు అక్టోబర్ మొదటివారంలో ప్రారంభమయ్యే వన్నెల చిత్రం సింగపూర్‌లో తయారవుతుంది. రంగనాథ్, శరత్‌బాబు, ఎం. రంగారావు, ప్రసాద్‌బాబు, డాక్టర్ ఛటర్జీ (నిర్మాత), ప్రభ, గీత, మంజు భార్గవి, గిరిబాబు నటిస్తారు. మరో చిత్రం జనవరి 10 న రావిమాతలలో ప్రారంభింపబడుతుంది మురళీమోహన్, గిరిబాబు ముఖ్య భూమికలు నిర్వహిస్తారు రెండు చిత్రాలకూ చక్రవర్తి సంగీత దర్శకుడు, రామచంద్రరావు దర్శకుడు. లోగడ "దేవతలారా దీవించండి, సింహగర్జన, ముద్దు - ముచ్చట" చిత్రాలకు సహకార దర్శకుడుగా రామచంద్రరావు పని చేసారు

సురేష్ మూవీస్

# మండే గుండెలు

-ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత **డి.రామానాయుడు** దర్శకత్వం **కె.బాపయ్య**

కథ:గుహనాథన్ మాటలు:జంధ్యాల

పాటలు:ఆచార్య ఆత్రేయ సంగీతం:కె.వి.మహాదేవన్

కళ:జి.వి.సుబ్బారావు కూర్పు:రవి




కోస్తా-ఆంధ్ర:**లక్ష్మీచిత్ర** నైజాం:విజయా సురేష్ పిక్చర్స్ సీడెడ్:నవభారత్ ఫిలింస్

రామకృష్ణా సినీ స్టూడియోస్ సమర్పించు




వర్ణ చిత్రం

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: యన్.టి.రామారావు బి.ఎ.,

# సినిమా

### ఎ. ఎ. కంబైన్స్

ఎ ఎన్ ఆర్ పుట్టినరోజు (సెప్టెంబర్) 20 న అన్నపూర్ణ స్టూడియోలో సెట్స్‌కు వెళ్లిన "బుచ్చిబాబు" వన్నెల చిత్రానికి దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం నిర్వహిస్తున్నారు ఎ ఎన్ ఆర్, జయప్రద, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, ఈశ్వరరావు, రావుగోపాలరావు, ధూళిపాళ, మాధవి, రమాప్రభ, సూర్యకాంతం పాత్రధారులు చక్రవర్తి, సెల్వరాజ్, భాస్కరరాజు, బాల, శాస్త్రి, బోసుబాబు తెరవెనుకకృషి చేస్తున్నారు

### రామకృష్ణా సినీ స్టూడియోస్

"శ్రీ తిరుపతి వేంకటేశ్వర కల్యాణం" అనంతరం మూడు సాంఘిక చిత్రాలు సెట్స్‌కు వెళ్లనున్నాయి కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో జనవరిలో ప్రారంభమయ్యే చిత్రంలో ఎన్ టి ఆర్, శ్రీదేవి, సత్యనారాయణ, రావుగోపాలరావు, చి॥ ఎన్ బాలకృష్ణ సరసన ఓ నూతన నటి వుంటారు కె బాపయ్య దర్శకత్వంలో ఏప్రిల్‌లో ప్రారంభమయ్యే చిత్రంలో ఎన్ టి ఆర్, శ్రీదేవి, సత్యనారాయణ, మోహన్‌బాబు ప్రభృతులు నటిస్తారు ఆ తదుపరి చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు

### రామ చిత్ర

బాపు దర్శకత్వంలో ఆర్ డి రెడ్డి, ఎస్ జయలక్ష్మి నిర్మించే వన్నెల చిత్రం తెలుగు, మలయాళ భాషల్లో ఆంధ్ర, కేరళ ప్రాంతాలలో తయారౌతుంది విజయచందర్, నూతన్‌ప్రసాద్, శారద ముఖ్య భూమికలు నిర్వహిస్తారు ముళ్ళపూడి వెంకటరమణ రచయిత మహదేవన్ సంగీత దర్శకుడు కె ఎస్ ప్రసాద్ ఛాయాగ్రాహకుడు అక్టోబర్ 1 న షూటింగ్ ప్రారంభమవుతుంది

### అశ్వనీ చిత్ర

"సెప్టెంబర్ 22 నుంచి అక్టోబర్ 30 వరకు విశాఖపట్నంలో ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది," అన్నారు డైరెక్టర్ బి వి ప్రసాద్ లక్ష్మణప్రసాద్ నిర్మించే ఈ వన్నెల చిత్రంలో జగ్గయ్య, నూతన్‌ప్రసాద్, చక్రపాణి, అల్లురామలింగయ్య, జయచిత్ర, అన్నపూర్ణ పాత్రధారులు గొల్లపూడి కథ, మాటలు రాశారు సి నారాయణరెడ్డి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు రామారావు ఛాయాగ్రాహకుడు కందస్వామి సంకలనకర్త

ఆడుతూ వస్తోంది

# నాలికపై నడయాడే ఓ కొత్తరుచి
# తితిత్తై తితిత్తై.... చక్ర టీ




చిక్కనైన చిక్కదనం
మహోన్నతం రుచి, సువాసనా అత్యుత్తమం !

రసవత్తరమైన కొత్త టీ– రసికాగ్రేసరులకు–
రసికులు ఊరట్లూగే... చక్ర టీ–
నాణ్యతలో అత్యుత్తమమైన మరొక మణిపూసలాంటి
తేయాకు. కొత్త చక్ర టీ ఇదిగో–కొత్త ఉత్పాదన **చక్ర టీ**



**టాటా-ఫిన్లే**
ఉత్పత్తి

daCunha/TF/CHT/2 Tel

# సినిమా



'శివమెత్తిన సత్యం'లో కృష్ణంరాజు, శారద.

## సురేష్ చిత్రాలు

కె. బాపయ్య దర్శకత్వంలో డి. రామానాయుడు నిర్మించిన సురేష్ మూవీస్ వన్నెల చిత్రం "మండే గుండెలు" అక్టోబర్ 5 న విడుదల. కృష్ణ, జయప్రద, శోభన్‌బాబు, జయసుధ, చంద్రమోహన్, మాధవి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, నూతన్ ప్రసాద్, కాంతారావు, గుమ్మడి, కాకరాల, సారథి ముఖ్య పాత్రధారులు. గుహనాథన్ కథకు బంధ్యాల మాటలు రాశారు. మహదేవన్ సంగీత దర్శకుడు. ఛాయ, శిల్పం, కూర్పు, సహకార దర్శకత్వాలను వెంకట్, జి. వి. సుబ్బారావు, రవి, కె. మురళీమోహనరావు నిర్వహించారు.

గుహనాథన్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అక్టోబర్ 10 నుంచి 20 వరకు మద్రాసులో తొలి షెడ్యూల్ జరుపుకునే సురేష్ ప్రొడక్షన్స్ కొత్త వన్నెల చిత్రంలో శోభన్‌బాబు, శ్రీదేవి, మురళీమోహన్, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య, జయచిత్ర, కాంచన, రమాప్రభ, ఎ. వి. వి. శకుంతల వగైరా నటవర్గం. బంధ్యాల సంభాషణకర్త. ఆత్రేయ గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. తక్కిన సాంకేతిక నిపుణులు "మండే గుండెలు" చిత్రానికి పని చేసినవారే. నిర్వహణ : మొహియుద్దీన్.

## టి. యస్. ఆర్. ఆంజనేయులు దర్శకత్వంలో....

లోగడ "కన్నె వయసు" చిత్రానికి దర్శకత్వం వహించిన టి. యస్. ఆర్. ఆంజనేయులు ఇపుడు ఎన్. వి. ఎస్. పిలిమ్స్‌వారు అక్టోబర్ 20 నుంచి నవంబర్ 15 వరకు సింగపూర్, హాంకాంగ్, బాంకాక్, మలేషియా, కౌలాలంపూర్‌లో చిత్రీకరణ సాగించే "లవ్ ఇన్ సింగపూర్" వన్నెల చిత్రానికి దర్శకుడుగా నియమింపబడ్డారు. ★

# డాలర్ విలువ !

మన దేశపు లెక్కల ప్రకారం ఒక డాలరు ఎనిమిది రూపాయల నలభై పైసలకు సమానమయినా, అమెరికాలో నివసించే భారత దేశీయుల ఆదాయము, సరుకుల వెలల నిష్పత్తిలో చూస్తే వారికి డాలరు రెండు రూపాయల నలభై ఒక్క పైసా మాత్రమే గిట్టుబాటవుతోందట.

### భారీ అపూర్వ సహోదరులు !

అమెరికాలో ప్రపంచంలోకల్లా మిక్కిలి బరువైన అపూర్వ సహోదరులున్నారట. వారిలో ఒకరి బరువు 336 కిలోలయితే రెండోకరి బరువు 327 కిలోలట. 336 కిలోల బరువున్నాయన ఇటీవల పరమపదించారట.

## సెక్సీ టి ఆత్మకథ !

హాలీవుడ్ నటి డయానా డోర్స్ సెక్సీనటి మూసిన తలుపుల వెనుక అని ఓ పుస్తకం రాసి, ఆ పుస్తకంపైన పెద్దలకు మాత్రమే అని అచ్చువేయించిందట. సినిమాలలాగే ఎ సర్టిఫికెట్లులతో రిలీజయిన యీ పుస్తకంలో తన వ్యక్తిగత జీవితంలోని సెక్సు అనుభవాలు, తనతో పడకలు పంచుకున్నవారి వివరాలతో ఎంచక్కా రాసేసిందట. ఈ పుస్తకం కాపీలు ఐస్‌క్రీమ్‌ల కన్నా వేగంగా అమ్ముడయిపోతున్నాయట. పోనీ మరి !

### తాపాన్ని తగ్గించే పచ్చగడ్డి !

మేడమీద గడ్డి పెంచితే దానివల్ల ఆ మేడలో వుండేవారికి సూర్యుని వేడి సుమారు 30 డిగ్రీలు తక్కువ అవుతుందట. గడ్డికి సూర్యుని వేడిని తక్కువచేసే శక్తి వుందని పశ్చిమ జర్మనీ శాస్త్రజ్ఞులు కనిపెట్టారట. దాంతో అక్కడ ప్రతీ ఇంటిపై డాబా మీదా గడ్డి మొలిపిస్తున్నారట.

### పెరుగుతున్న నిరక్షరాస్యత

అదేమి మహత్యమో మన దేశంలో నిరక్షరాస్యత నిర్మూలనకోసం ఖర్చు పెట్టిన్నకొద్దీ నిరక్షరాస్యత ఎక్కువవుతున్నట్లు తోస్తోందట. ప్రపంచంలో వుండే నిరక్షరాస్యులలో నలభై శాతం కేవలం హిందూ దేశంలో రెండువేల సంవత్సరంనాటికి లెక్క తేలుతారని ప్రపంచ నిపుణులంటున్నారట. మనదేశం నిరక్షరాస్యత నిర్మూలనకోసం ఖర్చుపెడుతూన్నదా, లేక పెడుతున్నామనుకుంటోందా !

### ఆదివారం అయితేనేమి !

మొరార్జీ దేశాయి ప్రధాని పదవి రాజీనామా చేసిన రోజు ఆదివారమట. ఢిల్లీలో ఆదివారాలు త్రాగుడు సరుకు దుకాణాలు తెరువరాదనే నిబంధన వున్నదట. అందువల్ల యీ రాజీనామా విన్న



ఆ అలవాటున్నవారు తమ ఆనందం పట్టలేక సరిహద్దు హరియానా రాష్ట్రం పరుగునవెళ్ళి మద్యంలో మునకలువేసి, ఆనకగొంతులు వెళ్ళారట తన్మయత్వంలో.

### వర్షానికి చెడిపోయిన గోధుమలు!

అమృత సరస్సు నగరంలో సుమారు 25 లక్షల గోధుమ బస్తాలు వానలవల్ల తడిసి, సర్వనాశనమయ్యాయట. అవి ముట్టుకోడాని క్కూడా వీల్లేనంత నాశనమై పోయాయి.

### తల్లి మందలింపు కూతురి ఆత్మహత్య !

సేలం సూరమంగళానికి చెందిన 47 ఏళ్ళ జోసఫ్ అనే మళయాళీ అతని కుమార్తె 15 ఏళ్ళ సెలిన్ అనే ఆమెను ఆమెతల్లి గిన్నెలు తోమమన్నదట. హయ్యర్ సెకండరీ స్కూలులో పి. యు. సి. చదువుతున్న ఆ పిల్ల గిన్నెలు తోమడం నామోషిగా భావించుకుందట. తల్లి పోరుపడలేక గిన్నెలు తోమితే కుక్కర్ గిన్నెకు గీతలు పడ్డాయని తల్లితండ్రులు చెలా చీవాట్లు వేసిందట. దాంతో మనస్సు విరిగిపోయిన సెలిన్ ఇల్లు విడిచి తిన్నగా ఏర్కాడు కొండకు వెళ్ళి లేడీస్ సీట్ అనే ప్రదేశంనుంచి దూకి ఆత్మహత్య చేసుకున్నదట. ఆ ప్రదేశం నాలుగువేల అడుగుల ఎత్తట.

### కాల్పులకు దారితీసిన పోలీసు అసభ్య ప్రవర్తన

కర్నాటక రాష్ట్రంకు చెందిన యాద్గిరి అనే వూరిలో బస్టాండులో బస్సు కోసం నిలబడిన ఒకమ్మాయి దగ్గరకో పోలీసు వెళ్ళి నివ్వూరు ఏం కథ అనడిగి ఆపక వస్తావా అని అడిగి అసభ్యంగా ప్రవర్తించాడట. దాంతో ఆవూళ్ళో జనమంతా గుంపుగాచేరి నాలుగువేలమందికన్నా ఎక్కువగా పోయి పోలీసు స్టేషనుకు వెళ్ళి ఆ పోలీసును ఉద్యోగంలోంచి తీసివెయ్యాలని కోరి అది వినలేదని స్టేషనుమీద రాళ్ళు రువ్వారట. రాళ్ళ వర్షం భరించలేని పోలీసులు తుపాకు పేలుస్తే ముగ్గురు చనిపోయి, చెక్కుమంది గాయపడ్డారట. పోలీసులకు తుపాకులివ్వడం ఆత్మరక్షణకోసం అన్నమాట !

### త్రాగుడు తెచ్చిన తంటా!

సేలం మెయ్యనూరు అనేచోట 25 ఏళ్ళ పాటప్పన్ అనే రిక్షా త్రొక్కువాడు అదేపనిగా సారాయి త్రాగడంవల్ల అతని భార్య కమల మొగుణ్ణి వదిలేసి పుట్టింటికి వెళ్ళిపోయిందట. పాటప్పన్ తన మేనమామ కూతురు 17 ఏళ్ళ కమల అనే అమ్మాయిని మరోపెళ్ళి పోయిన నెల 18న చేసుకున్నాడట. ఆ పిల్ల కాపురానికి వచ్చిన రోజు అతను రివాజుగా మస్తుగా తాగి ప్రేమకలాపాలాడబోయేసరికి కొపిల్ల అసహ్యంతో భయంతోనూ అతన్ని దగ్గరకురానివ్వకుండా గోలచెయ్యబోయేసరికి గమ్మున అతనామె పీక నులిమి, చంపేసి శవాన్ని వేసుకుపోయి ఓ మోట బావిలో పడేసి చక్కావచ్చాడట. అమ్మాయేదిరా అనడిగితే ఏమో నాకేం తెలుసు అన్నాడట. అనుమానంతో వూరంతా వెతికితే తెల్లారి ఓ నూతిలో తేలిందట. గాలాలువేసి లాగితే శవం తేలిందట.





# వేషంకోసం

ఎమ్. నాగేంద్ర ప్రసాద్

సుబ్బారాయుడికి సినిమా ఇంటర్వ్యూ రోజు, నాకు హైదరాబాద్‌లో పనిబడిన రోజు ఒకటి కావడమే దీనికంతా కారణం, సుబ్బారాయుడు పుట్టిందీ చదివిందీ హైదరాబాదే. కాకపోతే ఉద్యోగరీత్యా ఒకే వూళ్ళో వుంటున్నాం.

ఆ రోజు ఎండలో చమటలు కక్కుతూ నా దగ్గరకు వచ్చి సినిమా ఛాన్సు తగిలిందని చెప్పాడు. అతనిచ్చిన కవరు లోంచి మడత విప్పాను. గోవిందా ప్రొడక్షన్స్ వాళ్ళు 'కథకాదు' అనే సినిమా తీస్తున్నారు. నటీనటుల సెలక్షన్ ఫలానా తేదీన చేస్తున్నాం, హైదరాబాద్ రమ్మని రాశారు. శుభం! బయల్దేరమన్నాను.

మా సుబ్బారాయుడు అదివరకు ప్రకటనలు చూసి చాలా కంపెనీలకు తన ఫోటోలు అవీ పంపించాడు. అయితే అక్కడకు వెళ్ళాక పదివేలడిగారు తిరిగొచ్చేశాడు. ఇటీవలనే మరో వుత్తరం కూడా చూపించాడు. మద్రాసులో శేర్ దగాలాల్ మోసంచంద్ అనే నిర్మాత 'తిరిగి రాడకు' అనే గొప్ప సస్పెన్సు సినిమా తీస్తున్నాం అని ఇంటర్వ్యూకు పిలుస్తూ, ఉత్తరం అందిన పది రోజుల లోపల లాడ్జింగ్ వగైరా ఏర్పాట్ల నిమిత్తం యాభై రూపాయలు పంపించమన్నారు వారి నమ్మకానికై మనీయార్డరు చేసిన రసీదు కూడా పంపమన్నారు మనియార్డరు ఫారం కూడా వారే పంపారు. ఆ ఫారాలు మా వూళ్ళో దొరకడం లేదని వాళ్ళకెలా తెలిసిందో మరి! ఆ డబ్బులుంటే సిగరెట్లు కొట్టువాడి బాకీ తీరమని చెప్పినా వినకుండా మనియార్డరు పంపించాడు. వాళ్ళు చెప్పిన తేదీకి ఇక్కడ్నుంచే పోజులేసుకుంటూ వెళ్ళి అడ్రసు ప్రకారం ఎంత వెదికినా ఆ సిన్మా కంపెనీ బోర్డు కనిపించలేదని దుమ్ముకొట్టుకుని తిరిగొచ్చాడు.

ఈ సారి అదేరోజు నాకూ హైదరాబాదులో పనుంది కాబట్టి సుబ్బారాయుడూ, నేనూ కలిసే బస్సెక్కాం. బస్సులో విన్నవన్నీ నాకు తెలీని సినిమా కబుర్లు చెప్పాడు. ఫలానా హీరో ఫలానా డైరెక్టర్‌కు యావజ్జీవ... వేలిచ్చాడని, ఫలానా విలన్‌కు ఫలానావిధంగా మోక్షం వచ్చిందనీ, ఇలాంటి చెప్పో చెబుతుండగా బస్సు మమ్మల్ని హైదరాబాదు చేర్చింది.

ఇప్పటికి అరడజను సార్లు వెళ్ళినా హైదరాబాదు మెయిన్ రోడ్లయినా నాకు సరిగా తెలియవనే ఒప్పుకోవాలి. అంచేత సుబ్బారాయుడితో రావడం వల్ల నా పనులు తొందరగా పూర్తి చేసుకోవచ్చని భావించాను. కాని ఇంటర్వ్యూ జరిగే చోటుకు తనతోబాటు నేను కూడా వస్తే ఆ తర్వాత నాతో బాటు తను కూడా వస్తానని షరతు పెట్టాడు తప్పనిసరై అతని షరతుకు అంగీకరించాను

లేరికగానే సినిమా కంపెనీ అడ్రసు పట్టేశాడు. అక్కడ కూర్చున్న నిర్మాత కమ్ డైరెక్టర్ గారికి నమస్కారాలు చేసి కుర్చీల్లో కూర్చున్నాం. అప్పటికే కొంత మంది కూర్చుని వున్నారు సుబ్బారాయుడు తనకొచ్చిన ఇంటర్వ్యూ కాగితం చూపించగా, అది తీసుకుని కూర్చోమన్నాడాయన. నేను సుబ్బారాయుడి ఫ్రెండ్‌గా పరిచయం చేసుకున్నాను. ఒక క్షణం నా ముఖం కేసి చూశాడాయన.

"సినిమాకు పనికొచ్చేటట్లు వుంటే సినిమాలో చేరడానికి మీ కిష్టమేనా"

# వేషంకోసం

"ఇష్టం లేదన్నాను

'అదేమిటండీ! ఎంతోమంది సినిమా ఛాన్సు దొరికితే చాలని ఎగబడుతుంటే, మీరు వద్దంటారేమిటి?' విస్తుపోయి అన్నాడాయన

"సినిమాఫీల్డు మంచిది కాదని విన్నాను. అది కాకపోయినా, నాకు సినిమా పిచ్చి లేదండి! మా ఫ్రెండు తనతో బాటు రమ్మంటే వచ్చానంతే!" అన్నాను

"చెడు అంతా సినిమా పరిశ్రమలోనే వుందంటే నేను ఒప్పుకోను! మనిషిలో బలహీనతలుంటూ వుంటే ఆ మనిషి ఎక్కడవుంటే అక్కడే చెడు! బ్రాందీ కొట్లలో పనిచేసే వాళ్ళంతా త్రాగుతున్నారా?!..." అంటూ ఒక ఉపన్యాసం చెప్పాడాయన.

నేను మాట్లాడలేదు

"సరేలెండి, ఈ పరిశ్రమ మీద మీ అభిప్రాయాలేమిటో తెలుసుకుంటాను. వీటికి సమాధానాలు రాయండి!" అంటూ ఇద్దరికీ చెరొక పేపరూ అందించాడాయన.

మా సుబ్బారాయుడి సమాధానాల కన్నా నా సమాధానాలు బాగా నచ్చినాయి ఆయనకు. అందులో నాటకం, సినిమా, కళ మొదలయిన అంశాలపై చిన్నచిన్న ప్రశ్నలున్నాయి

"మీరు నాటకాలేశారా?"

'వేశానని తలూపాను.

"ఎన్ని?"

'డజను!"

"స్క్రీన్ టెస్టు వాయిస్ టెస్టు చేస్తాను. సూట్ కాకపోతే ఫరవాలేదు సూట్ అయితే సరిగ్గా ఆలోచించుకుని మీ అభిప్రాయం చెబుదురు గాని!"

నేను మొగమాటంలోపడి తలధూర్చాను.

"ఏ వేషం వేయాలని వుంది?" అనడిగారు మా సుబ్బారాయుణ్ని ఆ మాట అడగంగానే మా సుబ్బారాయుడు మొగమాటంలోపడి, ఇరుక్కుపోయి, నాలుక తెగ పీకేసుకుంటున్నాడు ఎలాగో తేరుకుని "మీ యిష్టమండి!" అన్నాడు.

"అలా కాదు! మీరు ఏలాంటి వేషం యిచ్చినా చేస్తారు. అయినా మీ కెలాంటి వేషమంటే యిష్టం?"

"అదేం లేదనుకోండి. ఏదైనా చేస్తాను అవకాశముంటే... ఏదైనా సపోర్టింగ్ హీరో వంటిది... అయినా సెలక్టు చేసే వారు మీరు కదా! నేనెలా చెప్పనండి?" అన్నాడు. మనలో మాట. మావాడి మనస్సు విలన్ పోర్షన్‌మీద వుంది. విలన్‌గాని, హీరోగాని అడగటం బాగుండి చావదు! అందుకు వూరకున్నాడు. నిజానికి మా సుబ్రాయుడికి రేప్‌సీన్లంటే మహా యిష్టం. అప్పుడప్పుడు ఏవి మనిషి ఇంట్లో ప్రవేశించాక తలుపులు దగ్గరకు వేసే అలవాటుంది. రేప్‌సీన్ల అనుభవాన్ని వాళ్ళు లెక్కవేసుకుంటే, మా వాడే విలన్‌గా సెలక్టు అవుతాడు.

ఆ తర్వాత నన్నూ, ఇంకా మిగిలిన వాళ్ళను కూడా అడిగారు. "అయిదు నిమిషాలు నిలబడే పోర్షన్ యేదైనా సరే" అన్నాము.

"విలన్ యిస్తే చేస్తారా?" అన్నాడు.

"చెయ్యన"న్నాను.

మేకప్ మేన్, ఫోటోగ్రాఫర్ రెడీగా వున్నారు డైరెక్టర్‌గారు ఏవో సంకేతాల్తో చెప్పారు మేకప్‌మేన్ మా తలకాయలు ఆయన చేతుల్లోకి తీసుకొని, మా తలకాయల్ని మార్చేశాడు. అంతా రెడీ అయ్యాం. సన్నివేశం, పాత్ర వగైరా చెప్పి యాక్షన్ చూపించమన్నారు. నా వంతు వచ్చింది. హీరోయిన్ తండ్రి పాత్ర అని చెప్పారు.

"హీరోయిన్ మోసపోయింది. బావిలో దూకి ఆత్మహత్య చేసుకుందని తెలిసింది మీకు. యాక్షన్ చూపించండి!"

చూపించాను. అలా మూడు సార్లు చేయించి స్నాప్ లాగారు.

"హీరోయిన్‌కు మోసం చేసినవాడు ఊరి జమిందారు కొడుకు. ఆ జమిందారుతో ఈ సంగతి ఎలా చెబుతారో చూపించండి!"

చేసి చూపించాను. మరోసారి ఫ్లాష్ వెలిగింది. ఇట్లా నవ్వమని, ఏడ్వమని రకరకాల ఫోటోలు తీశారు. ఆ తర్వాత వాయిస్ టెస్ట్ కూడా పూర్తయ్యింది

అందులో ఒకాయన మేకప్ చూస్తే హీరో వేషంలాగుంది. అప్పుడే శతచిత్ర సుందరుడైనట్టు మా మీద పోజులేస్తున్నాడు. మాతో మాట్లాడ్డం కూడా అవసరమా అన్నట్టు చూస్తున్నాడు.

మమ్మల్నందర్నీ తర్వాతరోజు కూడా రమ్మన్నాడు డైరక్టరు

మర్నాడు ఉదయం హైదరాబాదులో నా పని చూసుకుని డైరెక్టర్ గారి దగ్గరకు వెళ్ళాం. నిన్నటి వాళ్ళంతా మా కన్నా ముందుగానే హాజరయ్యారు. మాలో కొంతమందిని అగ్రిమెంట్లు రాయాలన్నారు. వాళ్ళంతా బరబరా సంతకాలు పెట్టేశారు. ఈలోగా నేను ఆలోచనలో పడ్డాను.

అసలా 'సిరి రా మోకాలు ఒడ్డటం' యేమిటి? అని నేను కూడా చివర్న సంతకం చేశాను.

షూటింగ్ అప్పుడు తప్పించి మిగతా అప్పుడు మా ఖర్చులు మేమే పెట్టుకోవాలి. డ్రెస్సుల ఖర్చులు కూడా ఎవరికి వాళ్ళే భరించాలి అన్నారు. ఏకగ్రీవంగా తలూపేశారు. తటపటాయిస్తున్న నావేపు ఆయన చూసేసరికి నేను కూడా తక్షణం తలూపేశాను.

"మళ్ళీ పిలుస్తాను. అప్పుడు రండి!" అన్నారు డైరెక్టరు.

మావాడు సినిమా కంపెనీ మెట్లు దిగుతూనే సినిమా స్టెప్‌లు వేయడం మొదలుపెట్టాడు. జనం అంతా చూసి ఆటోగ్రాఫ్‌ల కోసం చుట్టుముట్టి చంపుతారని భయపెట్టి, ఆటోలో కూర్చోబెట్టి బస్‌స్టాండుకు బయలుదేరి వచ్చాం. మేం వెళ్ళేసరికి 'నాన్‌స్టాప్' బస్సొకటి రెడీగా వుంది. తీరా ఎక్కాక అది 'నానాస్టాప్‌ల బస్సు'ని తెలిసింది. అది కాఫీహోటళ్ళు, ద్రాక్షతోటలు ఎక్కడ కనబడితే అక్కడ మొండికేస్తోంది. దానికో నమస్తే వెనక్కు నడిచినా నడుస్తుందని భయమేసి ప్రయాణికులు దిగి బుద్ధిగా ద్రాక్షపళ్ళు కొని కూర్చుంటున్నారు. కండక్టర్, డ్రైవర్‌లకు ద్రాక్ష రెండేసి కిలోలేయిస్తే మొరాయించి కదలడం మానేసింది. చెరి మూడేసి కిలోలు యిచ్చాక సంతృప్తిపడి ముందుకుకదిలింది. ఇక్కడ దరకు కిలోకు అర్థరూపాయి తగ్గడమే కాదు, తూకంలో కిలోకు పావుకిలో తగ్గినందుకు అన్యథా భావించకూడదని మనవి. బస్సుగిరికి అడుగడుక్కి ఆహారం బాధ అటుంచితే, ఇవతల మా సుబ్రాయుడికి తొందరగా వూరు చేరి ఫ్రెండ్సందరికీ ఈ సంగతి చెప్పాలని మహా 'యిది'గా వుంది. ఆ దురదతో కునుకు తీస్తున్న నన్ను గిరి చంపుతున్నాడు కూడా!

పది రోజుల తర్వాత మళ్ళీ పిలుపొస్తే వెళ్ళాం. డైరెక్టర్‌గారు మా చేత గుడ్డలు తీయించి కుట్టించారు. (ఊడదీయించి కాదు సుమండీ!) అప్పుడు నన్ను సెపరేటుగా పిలిచి చెప్పారు నీది చాలా ముఖ్యమైన 'రోల్' అని. 'నిజానికి కథకు ప్రాణం మీరే!' రిహార్సల్స్ బాగా చేయాలన్నారు. ఫెయిర్ కూడా వుందన్నారు. గుండెలో రాయి పడ్డట్టయింది. అయినా 'అలాగే నండి!' అని నవ్వుతూ సమాధానం చెప్పాను. వెళ్ళేటప్పుడు మా స్క్రీన్ టెస్ట్ ఫోటోలు చూపించి, ఒకో కాపీ కూడా ఇచ్చి పంపించారాయన.

ఇంటికి బయల్దేరాక, బస్సులో మా సుబ్రాయుడు ఎన్నెన్నో సినిమా కబుర్లు



# వేషంకోసం

చెబుతుంటే కోడతూ వెన్నెలవడిలో ప్రకృతిని ఆనందిస్తూ ప్రయాణం బాగానే సాగించాం. దారిలో గడ్డివేట్లు కనబడ్డప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఇంటి దగ్గర మాకో ఆవుదూడ వుంది దానికి మా వూళ్ళో గడ్డి వింత ప్రయత్నించినా దొరకడం లేదు. కండక్టర్‌గారు ఎలాగూ ఆపుతారు కదా, గడ్డి కొనుక్కుపోదామని మహా 'యిద'య్యాను. ఆపలేదు సరికదా, నా లాంటి పెద్దమనిషెవరో నోరు తెరిచి అడగ్గా 'బుద్ధిగా కూర్చోండి. గడ్డికోసం ప్రాకులాడకండి!' అని సుతిమెత్తగా చెప్పారు. ఆ పెద్దమనిషి చింతించి తనజన్మలో నానా స్టాపులు బస్సు తప్పించి నాన్‌స్టాప్ బస్సు ఎక్కనని ఇకమీదట తీర్మానించుకున్నట్టు డిక్లేర్ చేశాడు

మళ్ళీ పిలుపొస్తే యిద్దరం హైదరాబాద్ వెళ్ళొచ్చాం. ఈసారి ఉత్తరం మలేరియా జ్వరంతో మంచంలో పడ్డప్పుడు వచ్చింది. మా యిద్దరి పోర్షన్స్ మొదటి షెడ్యూల్‌లో లేవుగనుక ఆరోగ్యం కుదుట పడ్డాక రెండో షెడ్యూల్‌కు ముందుగానే హాజరవుతానని వాగ్దానం యిస్తూ మా సుబ్బారాయుడి ద్వారా లెటర్ రాసి పంపాను.

మా మిత్రుడితో మాట్లాడ్డం విని "షెడ్యూల్" ఏమిటంటే జ్వరంలో కలవరింతలా! అంది మా ఆవిడ

జ్వరంతగ్గి మంచం దిగాక చెప్పాను నా భార్యతో. ఇంతవరకీ సంగతి స్వంత భార్యతో చెప్పకపోవడం పొరబాటే అని ఒప్పుకుంటున్నాను కనుక క్షమించాలి.

"ఆ! ఏమిటి? నిజమా! వేళాకోళమా!" అంది భార్యామణి.

"నిజం!" అన్నాను.

"మీకెవరండీ సినిమాలో వేషమిచ్చేవాడు!" అని గాలి తీసింది అంతే! పౌరుషం ముంచుకొచ్చి హైదరాబాద్‌నుంచి తెచ్చిన స్టిల్స్ చూపించాను.

ఇక మాట్లాడలేదు.

కాస్సేపటికి వంటింట్లోంచి సన్నాయి నొక్కులాంటివి వినబడ్డం కథ రాసుకొంటున్న వాడినల్లా ఆగి లోపలికిపోయి చూశాను. మతిపోయింది నాకు

"ఇందాకటివరకు బాగానే వున్నావు కదే! ఇప్పుడేమొచ్చిందీ!"

సమాధానం లేదుగాని సన్నాయి స్వరం హెచ్చింది

"అవేవే బాబూ! అసలే రోజు అమావాస్య ఎవరైనా వింటే నాక్కాదా ఎదురింటి సీతారాముడి లాగ పిక్కి పెళ్ళాన్ని తన్నుతున్నాడని అనుకుంటారు! నన్ను రక్షించి సంగతేమిటో చెప్పు!"

"నేను రక్షించాలా? నా గుండెలండీ వరస! తెరమీద తైతెక్కలాడే ఆడాళ్ళ ఒళ్ళంతా రుద్దుతూ పాటలు పాడకోడానికి. సిగ్గు, బిడియం వదిలేసి సినిమాల్లో చేరడానికి తయారయ్యారుగా! పదిమందిలో మిమ్మల్ని నా మొగుడని చెప్పుకోగల్నా! మీకు నిజంగా సినిమాల సరదా వుంటే అలాగే చేరండి! కాని అక్కడ సినిమా ఆడోళ్ళ వళ్ళు రుద్ది, అరికాళ్ళు ముద్దెట్టుకుని నన్ను ముట్టుకోవద్దు. అంతేకాదు వాటిలో నానా బూతు కూతలు పాడి నోరు కంపు చేసుకుని నా యింటో వచ్చి మంచినీళ్ళు కూడా తాగడానికి కూడా వీలేద్దు. మీరు కుక్క ముట్టిన కుండతో సమానం! అంతే!" అంటూ వార్ డిక్లేర్ చేసింది.

"నాది హీరో వేషం కాదు విలన్‌వేషం అంతకంటే కాదు! నాది ముసలివాడి వేషమే! ఆ ఫోటోల్లో కనబడ్డం లేదూ!" అన్నాను జావగారిపోతూ

"ఇప్పుడు ముసలివేషాలు, రేపు పడుచు వేషాలూనూ!"

"అదికాదే బాబూ! ఒకసారి ముసలి వేషాలు వేస్తే చచ్చినా తిరిగి పడుచువేషాలు రావని మా డైరెక్టర్ కూడా చెప్పాడు నీ కోసమైనా పడుచు వేషం వద్దన్నదీ!"

"మీ సన్నాయినా చెప్పండి! నేను విన దలచుకోలేదు!"

మాయావిడ యిందుకు ఎన్ని కారణాలు చెప్పినా ఆవిడ భయమేమిటో నాకు తెలుసు! సినిమా వాళ్ళ నా శీలం చెడిపోతా దని! ముందుగానే చెప్పానుగా, నా యావిడకు నేను తులసి మొక్కలా వుండటం యిష్టం అని

"చూడవే మన సుబ్బారాయుడి పెళ్ళాం. వాళ్ళ ఆయన సినిమాలో చేరుతున్నాడని తెల్సిందగ్గర్నుంచి నవకాయ పిండివంటలు చేసి తినిపిస్తోందే!"

"నా కదంతా అనవసరం!"

"నీవు నాకు పెళ్ళానివై రాలేదే! నాకు కళ్ళెంలాగ వచ్చేవ్!"

"మీ రేమనుకున్నా సరే! మీరు షూటింగులకెళ్ళొచ్చాక నన్ను తాకడానిక్కూడా వీల్లేదు!"

"ఇదిగో జాగ్రత్త! మొగుణ్ణి తాకనీయ నంటున్నావు! తాకకూడదు తాకకూడదు అని పదిసార్లు అన్నావంటే అస్పృశ్యతా నేరం క్రింద కేసు పెట్టెయగల్ను" అన్నానే గాని హోమ్‌డిపార్ట్‌మెంటు కున్నంత పవరు ఎవరికీ లేదని విన్నాను "నాకు వళ్ళు మండుతూనే వుంది. మండుతున్న వళ్ళు హోమ్ డిపార్ట్‌మెంటు వాళ్ళు చల్లార్చరు! మనం మండి మండి ఆరి చల్లారాల్సిందే ఇలాటి కేసులు నా కెన్నో తెలుసు. 'పెయిర్' వుందనగానే నా గుండెల్లో రాయి పడ్డ





మాజా మేలైన జీవనానికి-
ప్రపంచంలోని పెద్ద పట్టణాలలో
మీరు వాడే తరహాకి చెందిన
రుచిగలది-స్ట్రాబెర్రీ, పైనాపిల్
మరియు ఆరంజ్ రుచులలో!
చల్లటి నీటిలో కలుపండి.

వెంటనే మీకోరిక రుచికరమైన పానీయం తయారవుతుంది.

సుఫ్లే-లస్సీ, కాక్‌టెయిల్
మొదలైన వాటితో బాగా
కలిసి పోతుంది.




మాజా అతి మేలైనది. మాజా మీరెప్పుడిచ్చినా, ఇచ్చే
ప్రతి ఒక్కసారి అదొక ప్రత్యేక సందర్భమనిపిస్తుంది
మీ పిల్లలు, అతిథులు దాని పండ్ల రుచిని ఇష్టపడతారు
మాజా పోషకారి-దానిలో విటమిన్ ఎ సి & డి మరియు
కాల్షియం ఉన్నవి ఒక గ్లాసు మాజా పెద్దలకు ప్రతి
రోజు కావలసిన 75% విటమిన్ సి ఇస్తుంది. నేడే మీ
ఇంట్లో ఒక మాజా సీసా ఉంచండి.




— మీకు మరియు మీ అతిథులకు.
జీవితంలో మంచి వస్తువులు మాత్రమే
వాడే అలవాటు గల వారికి

*FREE! Write for Maaza Recipe Book which tells you all about the many delicacies you can prepare with Maaza, to Parle Beverages Pvt. Ltd., MID Department, Western Express Highway, Chakala, Andheri (E), Bombay 400 093*

తిండుకే అయిదు నిమిషాలపాటు కోర్టులో ప్లీడరు వేషం లాంటి దేదో యిస్తాడనుకుంటే ఇలాంటి 'రోల్' యిచ్చి చంపాడా డైరెక్టరు పెద్దమనిషి" అని తిట్టుకుని "సరే పెళ్ళాంతో ఈ గొడవ లెందుకు. సినిమా రోలే మానేస్తే సరి!" అనుకున్నాను.

సమయానికి ఈ గొడవనుంచి తప్పించుకోడానికి అక్కడనుంచి లేచివెళ్ళిపోయాను.

సాయంకాలం యింటికి తిరిగొచ్చేసరికి, వేసు దిగిన పరుపు మీద నా భార్య, ప్రక్కన కుర్చీలో ఇంజక్షన్ చేస్తున్న డాక్టరు ఏం జరిగిందని అడగ్గా "గుండెదడ" అన్నారు. పున్నమినాడు పొంగే సముద్రంలా నన్ను చూశాక మరీ ఎక్కువైంది.

డాక్టర్ వెళ్ళిపోయాక, ప్రక్కనకూర్చుని బ్రతిమాలుతున్న ధోరణిలో "నీ కోసం సినిమా వేషం మానేస్తానే!" అన్నాను.

"నిజంగానా!" అంది.

"ఆ! నిజంగానే! కాని అగ్రిమెంటుమీద సంతకం చేశాను. ఎగ్గొడితే సినిమా వాళ్ళు నన్ను కోర్టుకీడ్చి గోళ్ళూడగొడ్తారు? ఎలా?" అని ఏడుపు ముఖం పెట్టాను.

ఆమె మాటాడలేదు.

మళ్ళీ మామూలే రాత్రి నిద్రలో పులిక్కిపడి లేచి చూశాను. మళ్ళీ ఆమెకు గుండెదడ వచ్చేసింది. నా కేమీ తోచకుండా ంది. మా మిత్రుడు నారాయణమూర్తి ంటాడు 'నేనేం జేతు చదునా"

26-10-'79

దీపావళి సంచిక

పోటీ కథలతో

# వేషంకోసం

అని. అది జ్ఞాపకం వచ్చింది ఈ గుండెదడ రోజుకొకసారి నుంచి మూడు నాలుగు సార్లకు పెరిగింది ఆమె మంచమెక్కడంతో పిల్లలు చిన్నవాళ్ళు కావడం వల్ల నేనే వంటింట్లో ప్రవేశించి, సినిమా పాత్రల సంగతలా వుంచి, వంట పాత్రలు తీసుకోవాల్సి వచ్చింది ప్రాణానికి సుఖం లేకుండా పోయింది. సినిమా ధ్యాసే పోయింది. ఇటు పెళ్ళాం అటు డైరెక్టరు కలలో కనబడుతున్నారు. అటు వెళ్తే ఈమెకు గుండె దడ! ఏమైపోతుందోనని భయం అటు వెళ్ళకపోతే కోర్టు! బుర్ర వేడెక్కిపోయి, బస్సు వాళ్ళు లై ర్రి సెల్ఫు కొట్టినట్టుగా లైటారి గోడకేసి నా బుర్రే బద్దలు కొట్టుకోవాలనుకున్న క్షణంలో సుబ్బారాయుడు తలుపు కొట్టి పిలిచాడు. వెంటనే వంటింట్లో దాక్కుందామా అన్నంత సిగ్గేసింది నాకు. ఇప్పుడు తనకేం చెప్పాలి? మరోక్షణం ఆగితే మళ్ళీ తలుపుల దబదబా కొడ్తాడనిభయమేసి ముఖానికి కాస్త చిరునవ్వు పులుముకొని బయటికొచ్చాను ఏవిటంత! సుబ్బారాయుడి తౌజండ్ క్యాండిల్ ముఖం మాడిపోయి వుంది. పక్కగదిలో కుర్చీ వేసుకు కూర్చుని "ఏమిటి సంగతులు?" అన్నాను మామూలుగా.

ఏమి చెబుతాడోనని భయంతో గుండెదడ వచ్చేస్తుందిప్పుడు సమయానికి నాకైనా పువయి గమని మా బాబును పిల్చి "గోపాలరావ్ డాక్టర్‌ను రమ్మన్నానని చెప్పరా!" అని చెప్పాను!

"దేనికైనా అదృష్టం వుండాలి సుమా!" డైలాగు బయట వదిలాడు. మనవాడి కేమైనా హీరో పవెషన్ వచ్చిందేమోనని అనుమానమేసింది డైలాగు విన్నాక.

ప్రైము ప్రకారం నేను రాలేదని నన్ను తీసేసి వుంటారని ఊహించాను. ఆ మాట తొందరగా చెప్పడే! వెధవ సస్పెన్సు!

"హీరోయిన్ వేషానికి వచ్చింది కదా 'గీత!' ఆమె మా అదృష్ట గీతనే తిరిపేసిందిరా!" అన్నాడు ఆవేశంగా

నా సంగతి చెప్పకుండా ఏమిటో చెబుతున్నాడు! అయినా ఇంటరెస్టింగ్‌గానే వుంది.

'ఏం జరిగింది?" నాలో కుతూహలం ఎక్కువైంది

"ఆర్గురు పిల్లల తల్లట ఆమె. మొగుడుకి చెప్పకుండా సినిమాల్లో చేరడానికి వచ్చేసింది! డైరెక్టర్ గారితో తనకు పెళ్ళి కాలేదని చాలా నమ్మకంగా చెప్పిందట!"

"ఆ తర్వాతేమైంది?"

"ఆ తర్వాత యేముంది. షూటింగ్ మొదలయ్యాక పది రోజులకు ఎలా తెలుసుకున్నాడో ఆ గీత మొగుడొచ్చి జుట్టు పట్టి నాలుగు తన్ని బస్టాండుకు లాక్కెళ్ళాడట! వాడి కమగప్పి పిల్లిద్దరినీ సాగనంపడానికి కూడా వెళ్ళిన హీరోతో కలిసి ఎటో కనబడకుండా మాయమయ్యిందట!"

"ఆ!!" ఆశ్చర్యపోయాను.

"ఆమె మీద ఎన్నో ఆశలు పెంచుకున్న విలన్ పాత్రధారి ఆమెమీద బెంగపడి మంచమెక్కేశాడు. చచ్చేటట్టు వున్నాడు. డైరెక్టర్‌కు మతిపోయి తల కొట్టుకుంటున్నాడు."



# వేషంకోసం

"ఆడాళ్ళను పాతవాళను పెట్టుకుంటే ఈ బాధ వుండేది కాదు గదూ!" అన్నాను.

"నిజమే! హీరో, ఆమె తనకు తెలుసు! ఆమెను పెట్టుకుంటే కొంత పెట్టుబడి పెడ్తానన్నాడట. అంచేత ఆయన ఒప్పేసుకున్నాడు."

"ఇప్పుడేమైంది?"

"ఇంకా ఏం కాలేదంటావ్! డైరెక్టరు నెత్తీనోరు కొట్టుకుని చెట్టుకు పుట్టకు చెప్పుకుని ఏడుస్తుంటే!" ఇక నాకు ధైర్యం వచ్చింది.

"మన గతి యింతేనంటావా?" అన్నాను

మా వాడికి చెడ్డ రోషం వచ్చింది.

"ఛ! మన సినిమా రిలీజుకు అంతా ఎదురు చూస్తుంటే యిప్పుడు మన పరువేంగావాలి? అవ పురెడ్డిపల్లి అడవిలో చెట్టూ, పిట్టా నవ్వదూ!"

"అలాకాదు! ఒక పని చేద్దాం!" అన్నాడు మళ్ళి తనే!

"ఊఁ చెప్పు!"

"నీకు సెలక్షన్ గ్రేడ్, ఏజన్సీ అరియర్సు రావాలన్నావ్ గదూ!"

"అది దేవుడు చెప్పాలి!"

"అలా కాదు! అవి ఏమాత్రం వస్తాయి? తెలిసిందే గదూ!"

"ఊఁ!"

"అయితే మనవాళ్ళింకా వున్నారు. అందరూ తలా పదివేలు వేసుకుని ఒకటిన్నరతో బ్లాక్ అండ్ వైట్ తీద్దాం! గవర్నమెంటు ఒకలక్ష సబ్సిడీ ఎలాగూ యిస్తుంది కద!"

నా బుర్ర తిరిగింది. మా స్నేహితుడి బుర్ర సాగుతోంది. "రేపు తిరిగొచ్చి ఆలోచిద్దాం!" అని లేచాను. మా యానిడ కి సంగతి చెప్పాక గుండెదడ మళ్ళీ రాలేదు.

ఇది జరిగిన మూడ్రోజులకు సుబ్బారాయుడింటికి వెళ్ళాను. సుబ్బారాయుడు మంచమెక్కి నూటమూడు డిగ్రీల్లోవున్నాడు. కలవరింతలు పలుకుతున్నాడు. నేను వచ్చి లేపగా కళ్ళు తెరిచి "గురూ! నీ చందా యెంత? సినిమా తీస్తున్నాం!" అన్నాడు [illegible] అరియర్స్ అందినాయని చెప్పి వచ్చేశాను. ఆ సాయంత్రానికి మూడు డిగ్రీల జ్వరం తగ్గినట్లు తెలిసింది.

# పాపం, దీనికి అమ్మా నాన్నాలేరు, మనం పెంచుకుందామా!



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే రీగల్ కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం. అందుకు 'రీగల్' మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు. 'రీగల్'కుగల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది. లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల–శక్తివంతమైన–నురుగునిచ్చేది 'రీగల్' ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్,' మీకు ఎంతో పొదుపుచేస్తుంది. 'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.




Rediffusion D/767e/TL/R

# హైదరాబాద్ నోట్ బుక్

—తిరుమల రామచంద్ర

## డాక్టర్ శివారెడ్డి :

బొంబాయి నేత్ర రోగ చికిత్స అన్నప్పుడు, సుప్రసిద్ధ నేత్ర వైద్యుడు డాక్టర్ మోడీ జ్ఞాపకం వస్తాడు ఎవ్వరికైనా. ఆయన పెద్ద ఎత్తున ఉచిత నేత్ర రోగ చికిత్సా శిబిరాలు దేశమంతటా ముఖ్యంగా తిరుపతి వంటి యాత్రాస్థలాలలో నిర్వహించి, పేద సాదల హృదయాలను, ఆశీర్వాదాలను చూరగొన్నాడు. ఆయన సేవాతత్పరత, రోగ నిదాన పద్ధతి, చికిత్సా విధానం ఆ శిబిరాలు చూచే అవకాశం కలిగినవారు ఎన్నటికీ విస్మరింపరు. తర్వాత వివిధ రాష్ట్రాలలోని నేత్ర వైద్యుల వివిధ సంస్థల ఆధ్వర్యాన ఉచిత నేత్ర చికిత్స శిబిరాలు నిర్వహింపసాగారు. డాక్టర్ పెరుగు శివారెడ్డి అలాటి పేర్గాంచిన వారిలో ఒక్కరు. డాక్టర్ శివారెడ్డి 1920 సెప్టెంబరు 12వ తేదీన కర్నూలు సమీపంలోని చిన్నదేవరపాడు గ్రామములో జన్మించారు. కర్నూలులో సిల్వర్ జూబిలీ హైస్కూలులో మెట్రిక్యులేషన్, అనంతపురం కళాశాలలో ఇంటర్మీడియట్ చదివి, మద్రాసు వైద్య కళాశాలలో 1946న ఎం. బి. బి ఎస్. పట్టా పుచ్చుకొని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం. ఎస్. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు నేత్ర చికిత్సా శాస్త్రంలో ఆచార్యులుగాను, నేత్ర రోగ శస్త్ర వైద్యుడుగాను పనిచేసిన పిదప 1961లో హైదరాబాదులోని సరోజినీ దేవి కంటి ఆసుపత్రికి సూపరింటెండెంట్ అయ్యారు ఈ పదవిలో ఈయన దాదాపు పదిహేను సంవత్సరాలపాటు ఉండడం వల్ల, ఈ ఆసుపత్రి దక్షిణాసియాలోనే ప్రధానమైన సంస్థగా రూపొందింది ఈయన చొరవ వల్లనే ఈ ఆసుపత్రిలో గ్లాకోమా (నీటి కాసులు) డయాబెటిస్ (మధుమేహం వల్ల వచ్చే) రెటినా (నేత్ర పటలం) వ్యాధులకు కొత్తగా విభాగాలు ఏర్పడడం, వాటిలో పరిశోధనా సౌకర్యాలు కల్పించడం, ఈ పరిశోధనలలో పాటే అంధత్వ నివారణకు కళ్లు దానం స్వీకరించే కేంద్రాన్ని (కార్నియా గ్రాఫ్టింగ్ సెంటరును) కూడా అభివృద్ధి చేశారు. దాని కోసం మరణించినవారి కళ్లలో ఒక నేత్ర నిధిని కూడ స్థాపించారు. కంటి పొరలను తొలగించడంలో హిమ విద్యుచ్ఛస్త్ర చికిత్స (క్రయో సర్జరీ) ప్రారంభించిన ప్రథమ భారతీయ శస్త్ర వైద్యుడు ఈయనే. సరోజినీ కంటి ఆసుపత్రిలో ఈయన సమర్థతతోను, ప్రజల సహకారంతోను ప్రత్యేకంగా ఒక నేత్ర రోగ చికిత్సాశాలను నెలకొల్పారు. ఇలాటిది ఏర్పడడం భారతదేశంలో ప్రప్రథమం. డాక్టర్ రెడ్డి గ్రామసీమలలో సంచార నేత్ర రోగ చికిత్సా శిబిరాలు నిర్వహించడం వల్ల ఈయన పేరు గ్రామీణులకు నిత్యపారాయణమైంది. ఇలాటి శిబిరాలను ఎందరికోలది నిర్వహించి, లక్షల కొలది చికిత్స చేశారు. లక్షకు పైగా జనానికి చూపు వచ్చింది. ఈయన ప్రజా సేవకు చిహ్నం సరోజినీదేవి కంటి ఆసుపత్రి సమీపంలో ఉన్న ఈయన ధర్మసత్రం. ఆసుపత్రికి వచ్చే బీద రోగులకు వారి అనుచరులకు ఈ ఆసుపత్రి ఉచితమైన విడిది. డాక్టర్ రెడ్డిని పెక్కు సంస్థలు సన్మానించాయి. ఈయన క్రయో థెరపీలో (హిమవిద్యుచ్ఛస్త్ర చికిత్సలో) జరిపిన పరిశోధనకు ప్రశంసగా, అఖిల భారత అప్థాల్మలాజికల్ సొసైటి 1973 లో విడెన్‌వాలా బంగారు పతకం బహూకరించింది. ఆఫ్రో ఏషియన్ అప్థాల్మలజీ అకాడమీ 1972లో టోక్యోలో జరిపిన వైజ్ఞానిక సమావేశానికి ఈయన అధ్యక్షత వహించారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ ఈయనను 1970 లో ఫెలోషిప్ తో గౌరవించింది. ఈయన పరిశోధనలో నేత్ర గోళంలో వ్యాధులు కలిగించే ఒకానొక క్రిమిని [గార్డియా క్రిమిని] కనుగొన్నారు 1964లో పశ్చిమ జర్మనీలో మ్యూనిచ్ నగరంలో జరిగిన అంతర్జాతీయ నేత్రవైద్య మహాసభలో ఈ క్రిమిని గురించి ప్రసంగించగా, ఆ సభ ఈయనను గార్డియా రెడ్డి, అని గౌరవించింది. అంతర్జాతీయ నేత్రపరిశోధనపై 1972 లో జరిగిన 20 మంది అగ్రశేణి నేత్రవైద్యుల మహాసభలో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. 1975లో మాస్కోకు వెళ్లిన భారతీయ వైద్య ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించారు ఈయన పెక్కు వైద్య సంస్థలలో సభ్యులు ఇటీవల భారత ప్రభుత్వ సంస్థ అయిన ఇండియన్ డ్రగ్స్ అండ్ ఫార్మస్యూటికల్స్ లిమిటెడ్‌కు డైరెక్టరుగా నియమింపబడ్డారు డాక్టర్ రెడ్డిని భారత ప్రభుత్వం 1970లో పద్మశ్రీ బిరుదంతోను, 1977లో పద్మభూషణం బిరుదంతోను గౌరవించింది 1975 సరోజినీదేవి ఆస్పత్రి సూపరింటెండెంటుగా పదవీ విరమణ చేసిన తర్వాత ఆంధ్రప్రదేశ్ ఆప్థాల్మలజీకి గౌరవ డైరెక్టరుగా నియమితులయ్యారు. ప్రస్తుతం ఆయన అంధులకోసం సేవ చేస్తున్న బ్రిటిష్ రాయల్ కామన్వెల్త్ సొసైటీ ప్రవేశపెట్టిన శుక్లం శస్త్రచికిత్స ప్రణాళికకు ప్రధానాధికారులు, స్నాతకోత్తర శిక్షణ సంస్థలో ఆచార్యులు 1969 నుంచి ఈయన ... గౌరవ నేత్ర రోగ శస్త్ర చికిత్సకులు

## ఉపశ్రుతి :

ఏం వరాలు కోరావమ్మా పుష్కర స్నానాలలో గోదావరితల్లిని అనడిగాను నా మిత్రుని సతీమణి— పాపాలు పోవాలని గోదావరమ్మను. వచ్చే జన్మలో హరిజనులుగాను, గిరిజనులుగాను పుట్టేట్టు అనుగ్రహించు తల్లీ అని కోరుకున్నాను అన్నారు— అప్పుడే, ఎందుకలా అన్నారు పక్కవారు. ఎందుకేమిటి? అగ్రకులాల వారికి ప్రతిచోట చుక్కెదురేగదా. వచ్చే జన్మలోనైనా సుఖపడొద్దా -అన్నారు మరొకరు.

# క్రొత్తగా! వేడివేడి వడ్డనలకు ఇగ్లూ హాట్‌ప్యాక్, వండి నాలుగు గంటలైనాసరే ఎంతో కమ్మదనము



ఎంతసేపైనాసరే, 4 గంటలదాకా అప్పటి కప్పుడు వండినట్లు తాజాగా వేడిగా పొగలొస్తూ, రుచిగా కమ్మగా వుంటాయి.

కాలము-ఇంధనము ఆదా :

ఇగ్లూ హాట్‌ప్యాక్ వాడితే తిరిగి వేడిచేసి వడ్డించే అవసరంలేదు. ఆ రోజులు పోయినాయి ఎంతో తీరిక వుంటుంది. ఖర్చు తక్కువగా వంట అవుతుంది. సాధారణంగా తిరిగి వేడిచేస్తే ఆహారంలో సత్తువపోతుంది.

ఇగ్లూ హాట్‌ప్యాక్ సుప్రసిద్ధమైన జనరల్ స్టోర్సులలో కావలసిన సైజులో లభిస్తుంది. ఇవ్వాళే ఇగ్లూ హాట్‌ప్యాక్ ఇంటికి తీసుకు వెళ్ళండి. మీకన్నీ లాభాలే. ఇంకా ఎంతో తీరిక కూడా!

ఇదే నిదర్శనము .

ఈ ప్యాక్‌ను రెండు నెలలపాటు వుపయోగించి పరిశోధించి, మద్రాసులో పాకశాస్త్రమునకు సంబంధించిన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్యాటరింగ్ టెక్నాలజీవారు చెప్పినది గమనించండి :
"ఇందులో వేడి నిల్వశక్తి చాలా బాగా వుంటుంది తాజాతనము ఎంతమాత్రము చెడదు. 8 గంటల తరువాత కూడా రుచి ఏమీ తగ్గదు. ఇవి చాలా సమర్ధవంతమైనవి."

మళ్ళీ వేడిచేయడం అంటూ వుండదు :

ఇప్పుడు వంట త్వరగా చేసుకోండి. కూరలైనా, పులుసైనా, అన్నమయినా సరే, క్రొత్తగా వచ్చే ఇగ్లూ హాట్‌ప్యాక్‌లో పెట్టి మూతపెట్టండి,

IGLOO hotpack

మెటోప్లాస్ట్‌వారి తయారీ



మెట్టూర్ బియర్డ్‌సెల్ లిమిటెడ్

OBM 4897/TG

# వారఫలం

## 12-10-1979 శుక్రవారం మొదలు 18-10-1979 గురువారం వరకు

**మేషం :** ముఖ్య కార్యాచరణ ప్రక్రమంగా జరుగమన్నది. మీ సన్నిహితులలో ఒకరి మూలాన కొంత ప్రయాస కనిపిస్తుంది. ఇంకా తలంచిన ప్రణాళిక సొంతంగా అమలు పరచలేక పోతారు. ఆదాయలోపం లేదు. క్రమంగా అన్ని రంగాలలో ముఖ్యంగా, కళాపత్రికల ప్రకటనల విషయంలో అభివృద్ధి. స్త్రీలకు: మంచి వారంగా అనుభవానికి రాగలదు.

**వృషభం :** చాలమందితో స్నేహ భావంకల వారుగా ఉంటారు. అందుమూలాన మీకు అభివృద్ధి చెప్పవచ్చు. సంఘ కార్యాలలో, పలువిధములుగా జోక్యం చేసికొంటారు. ఆదాయానికి మిత్రపరిచయం, స్నేహంతో దోహదం చేయగలదు. ఈ వారంతలవని తలంపుగా, ద్రవ్యాదాయసూచన గలదు. ఉష్ణోద్రేకంతో, ఆరోగ్యం కొంత లోపించవచ్చు. జాగ్రత్త! స్త్రీలకు : కళారంగానుభవం గలవారికి, సామాన్య ఉద్యోగులకు కొంత మెరుగు, ఆదయంలో కనిపిస్తుంది.

**మిథునం :** రాశ్యాధిపతి ఉచ్చస్థితినొందుట గమనింపదగిన విషయం. వృత్తిలో అధిక లాభం సమకూడే అవకాశమున్నది. తలచిన పనులు నిర్విఘ్నంగా నెరవేరే సూచన గలదు. పుత్ర పుత్రికా సంతానం వల్ల ఆనందం. మాతృ భావానికి అంతమెరుగుగా కాలం ఉండక పోవచ్చును. కొన్ని విధాల చిక్కులు రావచ్చు. ఆర్థికంగా అభివృద్ధి సూచితం. స్త్రీలకు: అన్ని విధాలా లాభ దాయకం. గృహానందం సంభవం.

**కర్కాటకం :** క్రీడారంగానుభవంగలవారికి సర్వతో ముఖాభివృద్ధి గలదు. కొందరు ఈ రాశి వారు విదేశాలకు ప్రయాణించవచ్చును. ముఖ్య వ్రాతలలో, లావాదేవీలలో, మిక్కిలి జాగరూకతతో మెలగాలి. సన్నిహితులు వృథా చిక్కులు కలిగిస్తారేమో చూచుకోండి. బంధుమిత్రులతో జరిపే సంభాషణలలో జాగ్రత్త వహించండి. స్త్రీలకు: గృహ కార్యభారం అధికం. ఆర్థికచిక్కులు సంభవం.

**సింహం :** మన వ్యాకులతకు సమయం. ఇంకా ఒకటి రెండు వారాలు ఇలాగే ఉంటుందనవచ్చు. లగ్న గ్రహస్థితి, ఏ విధంగా యోగ దాయకం గాదు. సంఘ గౌరవం, ద్రవ్యానుకూలత అనుకున్న రీతిగా ఉండదు. గ్రహబాధ ఇలాగుంటుందా, అని గ్రహింపగలుగుతారు. స్త్రీలకు: అన్నివిధాలా చిక్కులే. ఆర్థిక మాంద్యం గలదు.

**కన్య :** ఈ వారకాలం చిత్తా నక్షత్ర జాతకులకు, తక్కిన వారికన్నా బాగుంటుంది. వారారంభమే యోగప్రదం. ద్రవ్య లాభం ప్రశాంతికి అనుకూలమని గ్రహిస్తారు. ముఖ్య కార్యాచరణకు అనువైన వారం. వారఫలం ఉత్తమం. స్త్రీలకు: అప్రయత్న ధన లాభం, ఉద్యోగాభివృద్ధి గలదు.

**తుల :** వార ప్రథమ భాగంలో అధిక వ్యయం సూచింపబడును. ఆదాయం బహుస్వల్పమని ఊహించండి. సాధారణంగా వచ్చేరాబడికి లోటు లేదు. అధికంగా ఆశించిన దానికి అంతరాయాలుంటాయి. కుటుంబ సభ్యులకు కూడ సాయం చేయవలసి వస్తుంది. పనివారి బాధకూడ సంభవం. స్త్రీలకు: గురువారం సకల విధాల యోగదాయకమైన దినం. ఆర్థిక లాభం గలదు.

**వృశ్చికం:** మానసికంగా మీకు ఉత్తేజం కలుగుతుంది. ఇంతలో బంధుమిత్రుల రాక, క్రొత్త ప్రణాళికలను అమలు పరచుటనుగూర్చిన చర్చలు, ఆదాయం, ఆనందం, అభివృద్ధి, సంఘ గౌరవం ఈ వారం సంభవం. బుధవారం కుటుంబానందానికై వ్యయం చేయవలసి వస్తుంది. స్త్రీలకు: ఉద్యోగంలో, కళారంగంలో ప్రశాంతత చిక్కటమే గాక అభివృద్ధి కూడ కలదు.

**ధనుస్సు :** వారారంభంలో రాబడిని మించిన వ్యయమున్నది. విలాస వస్తు సేకరణకవకాశం గలదు. భాగ్యంలో గల గ్రహాలు శుభాశుభమిశ్రమ ఫలాలను ప్రసాదిస్తాయి. ఆరోగ్యానందాలకు ఏలాటి లోటు లేదు. జాయింటు వ్యాపారంగల వారు శ్రమకు గురి అవుతారు. స్త్రీలకు: ఏయే రంగాలలో అనుభవం గలవారైనా, వారు ధనాదాయం ఆశించవచ్చు.

**మకరం :** ఎన్నోవిధాల ఆలోచిస్తారు. రాశికి అష్టమంలో గల గ్రహాలు మంచి చేసే దానికన్నా కీడు చేయుటకే ప్రయత్నిస్తారు. గోచారఫలలక్షణమంతే. వృథాశలకు పోకండి. ఆశకు పోవటం మంచిది కాదు. త్వరపడి ఏ పనీ చెయరాదు. అట్లయిన ఆపదకే దారి తీస్తుంది. కంట్రాక్టు వ్యాపారస్థులకు, ఉద్యోగులకు, కొంతలో కొంత మేలు. స్త్రీలకు: ప్రథమ భాగం ఉత్తమ ఫలప్రదాయకం.

**కుంభం :** ఆర్థికాభివృద్ధికి లోపం లేదు. వ్యాపారానుకూలతకు అంతకన్న ఇబ్బందిలేదు. ఇటీవల జరుగదేమో అనుకున్న కార్యం విజయవంతం. బంధు వర్గానికి కూడ తోడ్పడగలరు. వార ద్వితీయభాగం ఆశించిన ఫలాలను ప్రసాదింపగలదు. స్త్రీలకు: అరిష్టములు క్రమంగా తొలగుట ప్రారంభమవుతుంది. ద్రవ్యాదాయానికి లోపం లేదు.

**మీనం :** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ఆనందంగా వారం గడుస్తుంది. రవి, బుధ గ్రహాల వల్ల, సకల రంగాలలో మేలు సమకూడుతుంది. వ్యాపారంలో అనుకున్న లాభాల నార్జింప గలరు. గురువారం ఉత్తమ దినం. ముఖ్య కార్యాచరణకు దిగండి. స్త్రీలకు: ఉద్యోగ వ్యాపారానుకూలత కలదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# ఇదిగో, ఈ 1000 రూపాయలు ఎవరూ దొంగిలించలేనివి.




## స్టేట్ బ్యాంక్ యొక్క కొత్త రూ. 1,000/- ట్రావెలర్స్ చెక్

- ఇవి ఇంకా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మరియు దాని ఎసోసియేట్ బ్యాంక్‌లకు గల 7300 ఆఫీసులలో రూ. 50/-, రూ. 100 మరియు రూ. 500/- విలువలలో కూడా దొరుకుతాయి.
- ఇవి ఏ రుసుమూ చెల్లించే పనిలేకుండా జారీ చేయబడతాయి. నగదుగా మార్చబడతాయి.
- ఇవి జారీ చేయబడిన ఆపీసు నుండి (ఒకవేళ దొంగిలించబడితే) డబ్బు తిరిగి అందుకునేందుకు హామీ.
- వాడకం తేలిక. నగదుగా మార్చుకునేటప్పుడు పరిచయం చేయించుకోవాల్సిన పనిలేదు.
- వీటి అమలుకు కాలపరిమితి ఏమీ లేదు
- భారతదేశమంతటా 25 000కు పైగా చోట్లలో నగదుగా మార్చుకునే అనువు.

## స్టేట్ బ్యాంక్ ట్రావెలర్స్ చెక్‌లు
**మీరు అలా ఇలా పోగొట్టుకోలేని డబ్బు**

**స్టేట్ బ్యాంక్**
**రండి, కలిసి ముందుకు కదులుదాం**

రాజాజీ శత జయంతి ఉత్సవం కూపన్లు నగరాలలోనూ, పట్టణాలలోనూ గల మా అన్ని బ్రాంచీలలో దొరుకుతాయి

# వంటలు

## దానిమ్మ హల్వా

కావలసిన వస్తువులు :- దానిమ్మ ఒక కేజి, గోధుమరవ్వ—ఒక కేజి, ఏలకులపొడి రెండు స్పూన్లు, జీడిపప్పు—200 గ్రా., పంచదార— ఒక కేజి, నెయ్యి అర కేజి, కొబ్బరితురుము కొంచెం, కిస్‌మిస్—50 గ్రా.

మొదట గోధుమ రవ్వను శుభ్రం చేసి నెయ్యితో వేయించాలి. దానిమ్మ గింజలను 2 గ్లాసుల నీళ్ళలో వేసి బాగా మరగించాలి. చల్లారేక, ఉడికించిన దానిమ్మగింజలను గట్టిగా పిసికి, గుడ్డలో వడకట్టి, రసాన్ని తీసి, వేయించిన గోధుమ రవ్వలో కలపాలి. పంచదారను పాకం తీసి అందులో దానిమ్మ రసం—గోధుమరవ్వ మిశ్రమాన్ని వేసి బాగా కలియబెడుతూ నెయ్యిని వేయాలి ఈ మూడు మరుగుతున్నప్పుడే జీడిపప్పు, కిస్‌మిస్ వేసి కొంతసేపు వేగనివ్వాలి. ఏ మాత్రం అడుగంటనీయరాదు. వెడల్పాటి పళ్ళెమునకు కాస్తంత నెయ్యిరాసి, అందులో ఈ హల్వాని సర్ది ఏలకపొడి, కొబ్బరి తురుము పైన అద్దాలి. బాగా చల్లారేక మనకు నచ్చే పరిమాణంలో కట్ చేసుకుంటే బాగుంటుంది.

— ప్రభామల్లిబాబు

## సగ్గుబియ్యం పచ్చడి

కావల్సినవి : సగ్గుబియ్యం పావుకేజీ. పెరుగు నాలుగు కప్పులు. కొబ్బరికాయ ఒకటి, తాలింపు సామగ్రి, నూనె, కారం, ఉప్పు తగినంత.

సగ్గుబియ్యంను బాగా వుడికించి ఒక పాత్రలో వుంచాలి. ఇందులో పెరుగును, కొబ్బరికోరును కలపాలి. నూనెలో కాస్తంత మినపప్పు, కరివేపాకు మొదలైన తాలింపు సామగ్రిని వేసి పాత్రలో సిద్ధం చేసుకున్న సగ్గుబియ్యం, పెరుగు, కొబ్బరి మిశ్రమాన్ని వేసి కలియబెట్టి దించాలి. ఈ పచ్చడి అన్నంలోకి, దోసె, ఇడ్లీలోకి బాగుంటుంది.

— కె. సీతాదేవి.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.